# పిల్లలకథలు

మొదటిభాగము



ఇది

చెన్నపురి ఎడ్యుకేషనల్ సర్వీసులోఁ జేరియుండిన

## మహాకాళి సుబ్రహ్మణ్యము

బి. ఏ., యల్. టి.

వ్రాసి రచించినది.



గాజక్ ముద్రాక్షరశాల, రాజమండ్రి.

1931.

 [వెల. 0—8—0.

# PREFACE.

A few years ago, one of the Directors of Public Instruction, Madras, remarked that children in Elementary Schools seemed more stupid in school than outside. This remark is, even now, quite true of pupils in some Elementary Schools This sad defect may, to a great extent, be remedied by raising the efficiency of such elementary schools and making them more attractive to pupils. One of the chief ways to make elementary schools more attractive to young children is to give story-telling a prominent place in the school curriculum. I have learnt from my long experience of thirty two years in the Educational Department that there are several elementary school teachers who have no stock of stories to illustrate their lessons To supply this want as well as to add to the small number of interesting readers that can be placed in the hands of elementary school pupils to be read by themselves, I have ventured to publish this book, which, I hope, will be patronised by all lovers of story-telling

My love for stories, I inherited, from my deceased father, Mahakali Subbarayudu garu, of revered memory, to whom this book is respectfully dedicated.

Mysore,<br>1—1—1931

M. SUBRAHMANYAM,<br>*Author.*

కీర్తిశేషులైన



మహాకాళి సుబ్బారాయఁడుగారు

# పీఠిక.

ప్రథమ పాఠశాలలలోని బాలురకు కథలను బోధించు నపుడు వారి కుండు నానందమునకు మేర యుండదు. కథాబోధ నావశ్యకతను గుర్తెఱిగిన యుపాధ్యాయులు కొందఱు ఒకసంవత్సరమున 'పిల్లులు, కోఁతి', 'నక్క, ద్రాక్షపండ్లు', 'నక్క, కాకి' మొదలగు కథలను నేర్పి, వానినే పైతరగతులలో కంఠపాఠము చేయించుటచే చిన్నిబాలురకు కథాభిలాష రూపుమాయుచున్నది. కాఁబట్టి, సులభమైన కథావాచకము లుండుట సమంజసమని తలఁచి, యీ పుస్తకమును బ్రచురించితిని. బాలురకొఱకు వ్రాసిన యీపొత్తమును విసంధితో సులభశైలిని నర్ధానుస్వారములును, కఠినపదములును, దీర్ఘసమాసములును లేకుండ వ్రాసితిని. ఉపాధ్యాయులును, విద్యావిచారణాధికారులును నీపుస్తకమును ఎలిమెంటరీ పాఠశాలలో నుపయోగపఱిచి, నాకుఁ బ్రోత్సాహము గలుగఁ జేసినచో వారియెడల కృతజ్ఞుఁడనై యిట్టి గ్రంథములను గొన్నిటిని వ్రాయ నేర్పాటు చేసెదను.

శబ్దార్థచంద్రికాది యమూల్య గ్రంథములను వ్రాసి, తమ యాంధ్రభాషాపాండిత్యమును వెల్లడి చేసినట్టియు, కీర్తిశేషులైనట్టియు, మాతండ్రిగారైన మహాకాళి సుబ్బారాయుఁడు గారి కీపుస్తకమును భక్తిపూర్వకముగ నంకితము చేయుచున్నాను.

మైసూరు
1-1-30.

గ్రంథకర్త,
మ. సుబ్రహ్మణ్యము.

# విషయసూచిక.

—:o:—

——

# పిల్లల కథలు.

## మొదటి పుస్తకము.

——:o:——

## 1. కాలిని నఱకిన శూరుడు.

ఒక గ్రామములో కచ్చేరిచావడియందు గ్రామస్థులు కూర్చుండియుండగా ఒకడు ఒక నఱకిన కాలిని ఈడ్చుకొనుచు పరుగెత్తివచ్చెను. వానిని గ్రామాధికారి చూచి, ఏల ఇట్లు రోజుచు పరుగెత్తి వచ్చితివి అనెను. అప్పుడు అతఁడు "ప్రభో, నేను యుద్ధమునుండి వచ్చుచున్నాను. నాశత్రువునకు నేను అందకుండుటకు పరుగెత్తివచ్చితిని" అనిపలికెను. అందుకు గ్రామాధికారి, "తలనఱకుట శూరుని ధర్మముకాని, కాలిని నఱకుట పిరుని లక్షణముకాదే" అనెను. అప్పుడు శూరుడు, "ఇంత మాత్రము నాకు తెలియక పోలేదు. నేనుబుద్ధిహీనుడను అని అనుకొంటిరా? తలను ఇదివఱకే ఎవ్వరో నఱకుకొని పోయిరి. కనుక నేను కాలిని నఱకుకొని వచ్చితిని" అని బదులు చెప్పెను.

——

## 2. ఒక వైష్ణవుడు, ఒక తురక.

ఒకవైష్ణవుడును, ఒక తురకయు ప్రయాణము చేయుచుండి, త్రోవలో ఒక తులసిచెట్టు కనబడగా, వైష్ణవుడు దాని దళములను కన్నులకు అద్దుకొని, చెట్టునకు ప్రదక్షిణము చేసెను. ఇది సాహేబుగారు చూచి, ఆచెట్టును కాలితో రాచి, దానిని పెఱికివేసెను. వైష్ణవుడు ముసల్మానుయొక్క గర్వము అణగింప దలచి, త్రోవలో ఉండిన దూలగొండిమొక్కకు మిక్కిలి భక్తితో ప్రదక్షిణము చేసెను. సాహేబుకు ఎక్కువ కోపమువచ్చి, ఆమొలకను చేతులతో పీకి, కాళ్ళతో నలిపి, పాఱవేసెను. ఒక నిముషములో సాహేబుకు సహింపరాని దురద కలిగి వైష్ణవునితోడు విడిచిపెట్టి, ఏడ్చుచు పడీవడీగ ఇంటికి పరుగెత్తి పోయెను.

---

## 3. ఒక యజమానుడు, తలుపు.

ఒకనాడు ఒక యింటి ఖామందు బయటకు పోవుచు, తన నౌకరిని పిలిచి, "ఇంటితలుపు జాగ్రత్తసుమీ" అని చెప్పి పోయెను. ఆసేవకుడు తనబంధువులయింటికి తత్క్షణము ఒకపర్యాయము వెళ్ళవలసివచ్చినందున ఇంటితలుపును ఊడబెఱికి, శిరస్సుమీద ఉంచుకొని బయలుదేఱెను. ఆసమయమున తన యజ

మానుడు వచ్చుట తటస్థించి "ఇదియేమి" అని సేవకుని ప్రశ్నించెను. అందుకు వాడు "మీరు ఇంటితలుపులు జాగ్రత్తసుమీ అని చెప్పితిరి కదా? ఒకసారి మా బంధువుల యింటికి పోవలసి వచ్చినదిగాన తలుపును జాగ్రత్తగా నెత్తి మీద బెట్టుకొని పోవుచున్నాను." అని పలికెను. అప్పుడు ఇంటి ఖామందు పకపకనవ్వి, "నాయుత్తరువులోని మాటలను గమనించితివే కాని దాని యభిప్రాయమును గ్రహించలేక పోతివి" అనెను.

---

## 4 ఒకలోభి, ఒకయాచకుడు.

టంగుటూరిలో ఒక జమీందారుడు ఉండెను. అతడు చాలలోభి. ఒకనాడు ఒక బిచ్చగాడు అతనిని సమీపించి ఒక పాటపాడెను. అందుకు జమీందారుడు సంతోషించి, తన గుమాస్తాను పిలిచి, బిచ్చగానికి నూఱురూపాయలు ఇమ్మని అనెను. గుమాస్తా చిత్తము అనిచెప్పి, వెలుపలికిపోయెను. బిచ్చగాడు గుమాస్తాను ఎంతఆశ్రయించినను అతడు రూపాయలు ఇయ్యలేదు. అప్పుడు యాచకుడు ధనికునియొద్దకుపోయి ఫిర్యాదుచేసెను. అప్పుడు అతడు యాచకునిచూచి, "నీవు నాకొఱకు ఏవిధముగ కష్టపడితివి అని సొమ్ము ఇయ్యమనుచున్నావు? నీ పాటవలన నాచెవులకు కొంచెము ఆనందము కలిగినది. కాబట్టి

దానికి బదులు నీచెవులకును కొంచెము మోదము కలుగుటకు గాను నూఱురూపాయలను ఇమ్మని గుమాస్తాతో చెప్పితివి. బదులుకు బదులు సరిపోయినది. నీవు ఇక పోవచ్చును." అని వచించెను.

---

## 5. ఒక హంస కాకి.

ఉజ్జయినీమార్గమున ఒక రావిచెట్టు కలదు. దానిమీద ఒక హంసయు, కాకియు వసించుచుండెను. ఒకనాడు ఒకవేట కాడు ఎండవేడిమికి తాళలేక విఁటిని, అమ్ములను క్రిందబెట్టి, ఆచెట్టునీడను శయనించుచుండెను. కొంతసేపటికి అతని ముఖముమీద ఎండ పడగా హంస తన ఱెక్కలనుచాపి, అతని ముఖముమీద నీడ పడునట్లు చేసెను. అప్పుడు ఆవ్యాధుడు నోరు తెఱచుకొని సుఖముగ నిద్రపోవుచుండెను. ఇతరుల సుఖమును చూడలేని పక్షి కదా కాకి? అది వ్యాధునినోట రెట్టవేసి ఎగిరి పోయెను. వేటకాడు మేలుకొని, హంసయుండుట కని, బాణము వేసి దానిని చంపెను.

---

## 6. ఒక నీలితొట్టిలో పడిన నక్క.

ఒకనాడు ఒక అరణ్యములో తిరుగుచు ఒక నక్క ఒక నీలితొట్టిలోసకిజారి, చచ్చినట్లు పడియుండెను. నీలితొట్టియజ

మానుడు మఱుచటినాడు ;ఆనక్కనుచూచి, చచ్చినదని భా వించి, దానిని దూరముగా పాఱవేసి పోయెను. తరువాత ఆ నక్క, నక్కలను అన్నిటిని పిలిపించి, "మీరు నానీలివర్ణమును జూడుడు. నన్ను రాజుగ ఉండుమనిచెప్పి, నాకు మనవనదేవత ఈనీలిరంగును వ్రాసినది" అని పలికెను. చిత్రము, చిత్రము అనిపలికి, నక్కలన్నియు దానిని గౌరవించినవి. కొన్నిదినము లలో కేసరిమొదలగు జంతువులుకూడ దానికి నౌకరులు అ య్యెను. అప్పటినుండి ఆనక్క తన స్వజనమునుకూడ అవమా నింప మొదలుపెట్టెను. ఈ అవమానమును సహింపక మిగిలిన నక్కలు అన్నియు ఒక యుక్తిని పన్నెను. ఒకనాటి సాయం కాలము సింహము, పులి మున్నగు జంతువులు అన్నియు నక్కచుట్టును చేరియుండగా, నక్కలన్నియు ఊళపెట్టుటకు ప్రారంభించెను. నీలివర్ణజంబుకముకూడ నక్కజాతిగానిదికనుక గట్టిగా ఊళపెట్టుటకు ఆరంభించెను. ఇది వినగానే జంతువుల న్నియు రంగువలన మోసపోతిమి కదా అని తలచి నక్కపై బడి, దానిని హింసించి చంపెను.

---

## 7. ఇద్దఱు వ్రాతకాండ్ర భార్యలు.

ఒకగ్రామములో ఇద్దఱు వ్రాతకాండ్రు కలరు. వారిని ఎవరైన ఏమైన వ్రాసిపెట్టుడు అని కోరినయెడల, వారు తల

యెత్తక వడిగా వ్రాయుచుందురు. ఇట్టి వ్రాతకాండ్రు ఎచ్చటను లేరని వారిభార్యలకు చాలగర్వము. ఒకనాడు ఆడువారు అందఱును చేరి వ్రాతవిషయము ముచ్చటించుచుండిరి. అప్పుడు మొదటివ్రాతకాని భార్యలేచి, 'నాభర్తయొక్క తెలివి మీకేమి తెలియును? ఆయన వ్రాసినది మఱియెవరును చదువలేరుకదా' అనెను. వెంటనే రెండవవానిభార్య, 'ఇది యొక గొప్పసంగతి అని చెప్పుచున్నావా? షాబాసు! నాభర్త వ్రాసినది నాభర్తకూడ చదువలేడే.' అనెను. స్త్రీలు అందఱును కడుపు ఉబ్బునట్లు నవ్విరి.



## 8 ఇద్దఱు యాత్రికులు.

ఉత్తరదేశమునుండి దక్షిణదేశయాత్రచేయువాడు ఒకడును, దక్షిణదేశమునుండి ఉత్తరదేశయాత్ర చేయువాడు ఒకడును, బెజవాడవద్ద కలిసికొనిరి. ఒకడు చూచినవింతలను మఱియొకనికి వర్ణించుచు, "నేను శాకక్షేత్రము అను గ్రామమునకు పోతిని. అచ్చట విపరీతమగు తోటకూరకాడలు కలవు. ఒక్కొక్కకాడ చుట్టుకొలత డెబ్బదేసి గజములు" అనెను. రెండవవాడు కొంచెముకూడ వెనుదీయక "నేను పాత్రాపురము అను గ్రామమునకు వెళ్ళితిని. అచ్చట ఒక కమ్మరిని చూచితిని. అతడు ఒక ఇనుపబాణలిని సాగగొట్టు చుండెను. దాని చుట్టు

కోలత యెంత అనుకొంటివి? మూఁడుదియ్యముల ఆముదలునుమీఁ!' అనెను. ఈ బాణాలి ఎందుకు ఉపయోగపడును అని మొదటి వాఁడు ప్రశ్నింపఁగా, నీవు చూచిన తోటకూరకాడలను ఉడుక బెట్టుటకు పనికివచ్చును." అని రెండవవాఁడు చిఱునవ్వుతో జవాబు చెప్పెను.

---

## 9. ఒక వెఱ్ఱి గొల్లఁడు.

ఒకనాఁడు ఒక దాసరి ఒక గొల్లవాని ఇంటికి వెళ్ళి కీర్తనలు పాడెను. ఆగొల్లవాఁడు వానిని చూచి వెక్కి వెక్కి ఏడ్వ మొదలు పెట్టెను. దాసరికి ఏమియు తోచక ఎందుకు ఇట్లు ఏడ్చుచున్నావు? అని ప్రశ్నించెను. అందుకు అతఁడు "నిన్న టిరోజున నామందలో ఒకగొఱ్ఱె నీవలెనే తల ఆడించి పదినిమి షములలో చచ్చిపోయినది నీవుకూడ త్వరలో మరణింతువే అని నాకు ఏడుపు పొర్లిపొర్లి వచ్చుచున్నది" అనెను. అందు కు దాసరి చిన్నఁబుచ్చుకొని ఇంటికిపోయెను.

---

## 10 కప్పలరాజు.

ఒక చెఱువులో పందలకొలది కప్పలు వసించుచుండె ను. వానికి ఒకరాజుకప్ప ఉండెను. ఒకనాఁడు ఒకఎద్దు, చెఱువు

లో నీరుత్రాగుటకు వచ్చినపుడు దానికాళ్లక్రిందపడి కొన్ని చిఱుకప్పలు మృతినొందెను. తోడనే తక్కిన కప్పలు తమరాజునొద్దకు పోయి, "మేము అంతపెద్ద జంతువును చూడలేదు" అని చెప్పినవి. అప్పుడు కప్పలరాజు ఊపిరి బిగబట్టి, పొట్టను ఉబ్బించి, "ఆజంతువు ఇంతకంటె పెద్దదా!" అని అడిగెను. కప్పపిల్లలు, "రాజా! మీరు ఎంతపెరిగినను దానివెంట్రుకకు సమానముకారు" అని బదులు చెప్పెను. అప్పుడు కప్పలఱేడు ఇంకను ఊపిరి బిగబట్టెను. అట్లు బిగబెట్టునపుడు దానిపొట్ట ఫటేలుమని పగిలి, మండూకరాజు చనిపోయెను.



## 11. ఒక ఉపనయనమయిన బాలుడు.

ఒక బాలునికి క్రొత్తగా ఉపనయనమైనందున పురోహితుడు సంధ్యావందనము చెప్పుచు, "ఓంభూః" అనుచోట ముక్కుపట్టుకో అని చెప్పెను. ఆబాలుడు తన ముక్కు తాను పట్టుకొనవలెనని తెలియక, లేచి వచ్చి, పురోహితుని ముక్కు గట్టిగా పట్టుకొనెను. పురోహితునికి ఊపిరి ఆడక, కోపముతో వదులు, వదులు అని అఱవగా ఇంతకంటె బిగువుగా పట్టుకొనవలయు కాబోలు అని తలచి మఱికొంచెము బిగువుగా పురోహితునిముక్కు పట్టుకొనెను. గురువు గిజగిజ తన్ను



బాలుడు పురోహితుని ముక్కుపట్టుకొనుట.

కథ—11

కొనుటచూచి, బాలుని తండ్రి తన కొమారుని యొక్క పట్టు వదలించి, పురోహితుని బ్రతికించెను.

---

## 12. నక్కలు, ఏనుగులు.

ఒక అరణ్యములోని నక్కలు ఒకఏనుగును చంపుటకు నిశ్చయించుకొని ఒకముసలినక్కను ఏనుగువద్దకు పంపెను. ఆ నక్క దంతిని సమీపించి "దేవరా, ఈఅడవిలోని నక్కలకురాజు ఎవ్వడును లేడు. మిమ్ములను రాజుగ చేయదలచి నారము. మీ సమ్మతిని ఇందు" అని బ్రతిమాలెను. ఆఏనుగు చాల సంతోషించి, రాజు అగుటకు ఒప్పుకొనెను. అప్పుడు ఆనక్క మిగిలిన నక్కలుఉండు తావునకు కరిని పిలుచుకొని పోయెను. త్రోవలోని బురదలో ఏనుగు దిగబడి కదలలేకపోయెను. అప్పుడు నక్క చాల జాలిపడినదానివలె దుఃఖించి, తాను ఒకటితలచిన దైవము ఒకటి తలచును, అని పలికి ఊరకుండెను. ఇటు అటు కొంతసేపు కొట్టుకొని గజము ప్రాణము విడిచెను.

---

## 13. ఒక బాలుడు, చిలుక.

ఒకనాడు ఒకబాలుడు ఒకచెట్టుమీద ఒక రామచిలుకను చూచెను. చెట్టు ఎక్కి దానిని పట్టుకొని, ఇంటికి తీసికొనిపోయి, పంజరములో ఉంచి దానిని పెంచెను. దానికి మాటలు

కూడ నేర్పెను. ఎవరుగాని చిలుకనుచూచి, ఏమైన అడిగినయెడల "అందుకు సందేహమా" అని బదులు పలుకును. ఆబాలుడు ఆచిలుకను విక్రయింప దలచి బజారునకు తీసికొనిపోయెను. దానివెల ఎంత అని ఒకడు అడిగెను. దానివెల నూఱు రూపాయలు అని బాలుడు చెప్పెను. అప్పుడు దానిని కొనదలచిన వాడు నూఱురూపాయలు నీకు ఇయ్యదగునా అని చిలుకను అడిగెను. అప్పుడు ఆచిలుక "అందుకు సందేహమా" అని బదులు చెప్పెను. ఆచిలుకపలుకు మిక్కిలి పొందియుండుటచూచి, ఆకాపు నూఱురూపాయలు ఇచ్చి చిలుకను ఇంటికి తీసికొనిపోయెను. ఇంటివారు ఏప్రశ్నను అడిగినను చిలుక "అందుకు సందేహమా" అనుచుండెను. కాపు ప్రాణము విసిగి, "నాకర్మము కాలి, ఈపాడు చిలుకను కొంటిని. నూఱురూపాయలు దీనికి దండుగ బెట్టితిని" అనెను. అప్పుడు ఆచిలుక పెద్ద గొంతుతో "అందుకు సందేహమా" అనెను. వ్యర్థముగ సొమ్మును వ్యయము చేసిన దుఃఖమువలన కాపు కృశించి, కొంతకాలమునకు చనిపోయెను.



## 14 ఇద్దఱు స్నేహితులు.

ఒక బీదవాడు అదృష్టమువలన ధనవంతుడు అయ్యెను. అప్పుడు అతనికి మిన్నుమట్టు తెలియలేదు. అతని పూర్వస్నే

హితుడు ఒకడు అతనిని సమీపింపగా, 'నీవు ఎవరు? ఎందుకు వచ్చినావు? ఏమికావలెను? పేరేమి?' అని కసరుకొనెను. అప్పుడు ఆసఖుడు "నేను నీప్రాణస్నేహితుడను. మనము ఇద్దఱము సహపాఠకులము. నీకు నేత్రములు పోయినవి అని విని పరామర్శ చేయుటకు వచ్చితిని" అని పలుకుచు, చివుక్కున లేచిపోయెను.

---

## 15. ఒక దొంగ.

ఒకరాత్రి ఒక దొంగ ఒక ధనవంతుని గుఱ్ఱపులాయమునకు కన్నము వేసి, అతని గుఱ్ఱమును దొంగిలించుకొనిపోవు సమయమునందు గాని యజమానుడు లేచివచ్చి, అతనిని పట్టుకొనెను. గుఱ్ఱములను దొంగిలించు పద్ధతులలో శ్రేష్ఠమైనదానిని తెలిపినయెడల నిన్ను విడిచిపెట్టెదను అని అతడు చెప్పెను. అప్పుడు ఆచోరుడు అశ్వమును సమీపించి, దానికాళ్ళకు ఉండిన బంధములను విప్పి, కళ్లెమును తగిలించి, గుఱ్ఱమును ఎక్కి 'ఇదే శ్రేష్ఠమైనపద్ధతి' అని అఱచుచు దౌడుతీయించెను.

---

## 16. పెండ్లి, పోగులు.

ఒక బీదపిల్లవానికి పిల్లను ఇచ్చుటకు కొందఱు వచ్చిరి. పిల్లవానికి నగలు ఏవియు లేనందున ఎక్కడనుండియో

చెవుల పోగులు ఎరువు తెచ్చిపెట్టి, తలదువ్వి, బొట్టుపెట్టి, పురోహితుని దగ్గఱ వానిని కూర్చుండబెట్టిరి. పెండ్లివారు పురోహితునిని "ఈతడేనా పెండ్లికొడుకు" అని అడిగిరి. అందుకు పురోహితుడు, "పెండ్లికొడుకు ఇతడే కాని, పోగులు ఇతనివి కావు" అనెను. వచ్చినవారు వచ్చినట్లే వెడలిపోయిరి. బాలుని తల్లిదండ్రులు పురోహితుని నిందించి, అట్టి తెలివితక్కువ మాటలు ఇకముందు చెప్పవద్దని కోరిరి.

కొన్నాళ్ళకు మఱికొందఱు వచ్చి, 'ఈతడేనా పెండ్లికొడుకు' అని అడిగిరి. అప్పుడు పురోహితుడు 'పెండ్లికొడుకు ఇతడే, పోగులుకూడ ఇతనివే; తప్పక ఇతనివే' అని గట్టిగా అఱచెను. పోగులుకూడ బాలునికి లేవని తలచి, ఈపెండ్లివారుకూడ వెళ్ళిపోయిరి.



## 17. లోభులగు అన్నదమ్ములు.

లోభులగు ఇద్దఱు అన్నదమ్ములు తల్లికి ఉత్తరక్రియలు చేయునపుడు గోదానము ఇయ్యవలసి యుండెను. అప్పుడు అన్న, తమ్ముని అవతలకు పిలిచి, మొన్నమందలో తప్పిపోయిన ఆవును ధారపోయుదమా అని అడిగెను. అందుకు తమ్ముడు, తప్పిపోయిన ఆవును వెదకినయెడల అది దొరకవ

చ్చెను. కాబట్టి దాని నిచ్చుట నాసలు కాదు. గతసంవత్స రము దొమ్మతగిలి చచిపోయిన గోవును ధారపోయుదము అని పలికెను.

---

# 18 దురాశగల నక్క.

ఒకనాడు ఒక వేటకాడు ఒక అరణ్యమునకు పోయెను. అచ్చట ఒక లేడిని చూచి వాడు దానిని బాణముచే చంపెను తరువాత ఒక పుట్టచాటున ఒక అడవిపంది అతని కంటబడెను. దానిని కూడ శరప్రయోగమున చంపెను. అంతలో ఒక సర్పము పుట్టనుండి వెలువడి వానిని కఱచెను. తన ఖడ్గముతో దానిని వేటకాడు నఱకెను కాని, దాని విషమువలన వాడు త్వరలో మృతినొందెను.

ఆసమయమునందు ఒకనక్క ఆదారిని పోవుచు, చచ్చిపడియున్న లేడిని, పందిని, పామును, మనుష్యుని చూచి మిగుల సంతోషించి, తనకు కొన్ని నెలలవఱకు ఆహారము దొరకినది అని తలచెను. ప్రక్కను పడియున్న బాణమును చూచి, "దీనినరము ఈ దినమునకు చాలును." అని నిశ్చయించి, దానిని కొఱకెను. అప్పుడు పట్టుతప్పి, ఎక్కుపెట్టియున్న బాణము పైకి ఎగిరి, జంబుకము హృదయమునందు నాటుకొనెను. దానివలన, పాపము! ఆ జిత్తులమారినక్క కాలధర్మమునొందెను.

---

## 19. బెబ్బెబ్బే.

ఒకగ్రామములో ఒకవర్తకుడు ఉండెను. వాడు పొందినలాభమును ఒకచోట దాచిపెట్టి, వర్తకములో నష్టమువచ్చినది అని బాకీఉన్నవారందఱితో చెప్పుచుండెను. వారు ఊరుకొనక అతనిని బాధింపదొడగిరి. వానిలో ఒకడు వర్తకునియొద్దకువచ్చి, నాసొమ్ము నాకు ఇచ్చివేయుము. ఈగండము తప్పుటకు ఒక ఉపాయము చెప్పెదను. ఎవరైనను వచ్చి సొమ్ము అడిగినయెడల బెబ్బెబ్బే అని అఱువుము, అని బోధించెను. అతడు అదేప్రకారము చేయుచు వచ్చినందున అతనికి పిచ్చిపట్టినది అని తలచి అందఱును తమకు రావలసిన సొమ్మువకు నీళ్లువదలుకొనిరి. తర్వాత పైయుక్తి చెప్పినవాడు, వచ్చి "నాసొమ్ము నాకు ఇమ్ము" అనెను. అప్పుడుకూడ వర్తకుడు బెబ్బెబ్బే అనెను. అతడు "ఏమి వర్తకుడా! ఉపాయము చెప్పి గండము తప్పించిన నాకుకూడ బెబ్బెబ్బేనా? అనెను. ఆవర్తకుడు "నీకును బెబ్బెబ్బే, నీతాతకును, బెబ్బెబ్బే" అని జవాబు చెప్పెను.



## 20. ఒక ప్రభువు బానిస.

రాపూరు అను గ్రామములో ఒక ప్రభువు ఉండెను. అతనికి ఒక బానిస ఉండెను. కొన్ని సంవత్సరములు చక్క-

గా పనిచేసి, ఒకనాడు కొంతసొమ్ముతో పాఱిపోయెను. కొన్ని దినములుతర్వాత ఆప్రభువు వేఱుగ్రామమునందు తనబానిసను పట్టుకొని, "వీడు నాబానిసగనుండి నాసొమ్మును ఎత్తుకొని పోయెను" అని ఫిర్యాదుచేసెను. 'వీడు నా బానిసగనుండి నా సొమ్మును ఎత్తుకొని పోయెను' అని బానిస బదులు ఫిర్యాదు చేసెను. ఇద్దఱికిని సాక్షులు లేరు. అంతట న్యాయాధికారి వారిని ఒక కిటికీయొద్ద నిలువ బెట్టించి, మెడలను ముందుకు చాపుమని ఉత్తరవు చేసెను. తలారిని పిలిచి వీరిలో బానిసతలను క్షణములో నఱకవలసినదని ఆజ్ఞాపించెను. అప్పుడు ప్రభువు తనతలను కదల్పలేదు. బానిస మాత్రము భయపడి తన తలను వెనుకకు లాగుకొనెను. దీనివలన న్యాయాధికారి బానిస ఎవడో కనుగొని వానిని ప్రభువునకు శిక్షకొరకు ఒప్పగించెను.



## 21 ఒక బ్రాహ్మణుడు, అతని భార్య, ముంగిస

ఒకానొక గ్రామములో ఒకానొక దంపతులు తమకు చాలకాలము సంతానము లేనందున ఒక ముంగిసను పెంచుకొనుచుండిరి. కొన్నాళ్ళకు వారికి ఒక పుత్రుడు కలిగెను.

ఒకనాడు బ్రాహ్మణి నదికి స్నానమునకు వెళ్ళెను. రాజుగారు వర్తమానమంపినందున బ్రాహ్మణుడు బిడ్డపండుకొన్న ఉయ్యాలదగ్గఱ ముంగిసను కావలి ఉంచి నగరునకు వెళ్ళెను.

కొంతసేపటిలో ఒకపాము కనబడెను. అప్పుడు ఆముంగి సర్పమును కొఱికివేసి, యజమానునికొఱకు ఎదురుచూచుచు వీధిలో నిలుచుండెను. బ్రాహ్మణుడు ఇంటికివచ్చి, రక్తముతో ఎఱ్ఱగనుండిన ముంగిసనోటిని చూచి, తనబిడ్డను ముంగిస చంపినదని తలచి, ఒక కఱ్ఱతో దానిని చంపివేసెను.

లోపలికి పోయిచూడగా, బిడ్డ సుఖముగ పరుండియుండెను. అతడు చచ్చిపడియున్న పామునుకూడచూచెను. తాను చేసినపనికి మిక్కిలి వగచుచుండగా అతనిభార్య నదినుండివచ్చి జరిగిన సంగతి తెలిసికొని, కోపమువలన గలిగిన హానికి చాల దుఃఖించెను.



## 22 ఒక ముసలిది· ఒక బాలుడు·

ఒక ముసలిదాని దొడ్డిలో ఒక కొబ్బరిచెట్టు ఉండెను. ఒక కొబ్బరికాయను తినవలెననిముసలిదానికి కోరిక గలిగెను. త్రోవలో పోవు ఒక బాలునిచూచి, "నాయనా, నాకు కొబ్బరి తినవలెనని ఆశకలదు. నాదొడ్డిలోని చెట్టుఎక్కి, నాకు ఒకకాయను కోసియిమ్ము. నీకు పుణ్యము వచ్చును" అని చెప్పెను. ఆబాలుడు అందుకు సమ్మతించి, చెట్టెక్కి, అయిదుకాయలు కోసెను. ఇన్నికాయలు ఎందుకు కోసితివి, అని ముసలిది అడిగెను. అందుకు ఆపిల్లవాడు, "నేను చాల కాయలు కోయుటే

దవ్వా. నేను ఎక్కినందుకు ఒక కాయ; కోసినందుకు ఒక కాయ; దిగినందుకు ఒక కాయ; నాకు ఒక కాయ; నీకు ఒక కాయ. నీకు ఆకలి లేనియెడల నీకాయనుకూడ నాకు ఇమ్ము; కమ్మగ తిందును" అని బదులు చెప్పి, కాయలతో పరుగెత్తెను.

---

## 23. ఇద్దఱుభార్యలమగడు.

ఒకనికి ఇద్దఱు భార్యలు. ఒకతె ముసలిది; ఒకతె పడుచుది. మగనితల నఱయుచుండుట చూచి పడుచుభార్య తెల్ల వెండ్రుకలను ఒక్కటొక్కటిగ లాగివేయుచుండెను. తనకంటె మగడు చిన్నవాడు అని తలచి, నలుగురు నవ్వుదురని ముసలి భార్య నల్లవెండ్రుకలను ఒక్కటొక్కటిగ పెఱికివేయుచుండెను. ఇట్లు కొన్ని దినములలో మగడు బట్టతలవాడు అయ్యెను. పాపము!

---

## 24. అధర్మపు న్యాయాధిపతి.

ఒకడు రామేశ్వరయాత్రకు పోవుచు అధర్మపురమునకు వచ్చునప్పటికి తాను తెచ్చిన బియ్యము అయిపోగా బజారుకు పోయి, రూపాయకు 12 కుంచముల బియ్యము వంతున ధర

ఏర్పాటు చేసికొని, పదిరూపాయలు వర్తకునికి యిచ్చెను. అతడు కుంచమును బోర్లించి కొలుచుటకు ప్రారంభించెను. 'ఇది ఏమి?' అని అడుగగా, 'ఇది యింతే' అని సెట్టి చెప్పెను. అప్పుడతడు న్యాయసభలో ఫిర్యాదు చేసెను. కుంచమును తిరుగవేసి కొలువుమని బేరము చేసినపుడు అడిగితివా అని న్యాయాధిపతి అడిగెను. లేదు అని బాటసారి చెప్పెను. తిరుగవేసి కొలుచుటకు సెట్టి యిష్టపడలేదు. బోర్ల వేసి కొలుచుటకు యాత్రికుడు అంగీకరింపడు; కావున అడ్డముగపెట్టి కొలువుమని అధర్మపురవు న్యాయాధిపతి తీర్పుచెప్పెను.

---

## 25. సంధ్యావందనము మఱచిన బాలుడు:

సంధ్యావందనము మఱచిపోయిన బాలుడు ఒకడు మరల దానిని నేర్చుకొనవలెననెడి కోరికతో తన తండ్రిని సమీపించి, 'నాన్నగారూ, నాకు సంధ్యావందనము నేర్పండి' అని బ్రతిమాలెను. తండ్రికి కోపమువచ్చి, 'ఓరీ, విధవా, నాలుగు సంవత్సరములకు మునుపు నేర్చుకొనిన సంధ్యావందనము నీకు జ్ఞప్తి లేనప్పుడు నలువది సంవత్సరములక్రిందట నేర్చుకొన్నది నాకు ఎట్లు జ్ఞాపకముండును?' అని కొమారుని మందలించెను.

---

## 26. ఒక పులి ఒక ఆవు.

ఒక గోవు అడవిలో మేయుచుండగా ఒక పులి దానిని పట్టుకొనెను. అప్పుడు ఆగోవు వ్యాఘ్రముతో, 'నాకు ఒక కొమారుడు కలడు. నేను యింటికిపోయి వానికి కడుపునిండ పాలిచ్చి, శీఘ్రముగ వచ్చెదను' అనిచెప్పెను. తుదకు పులి యొక్క సమ్మతిని పొంది, గోవు యింటికి పోయెను.

ఆగోవు తనకొడుకును చూచి, జరిగిన సంగతి వినిపించి నేర్పవలసిన బుద్ధులను నేర్పి' కడుశీఘ్రముగ వ్యాఘ్రసమీపమును చేరెను. ఆవుయొక్క సత్యసంధతకు పులి అద్భుతపడెను. దానిని చంపుటకు ఎంతమాత్రము ఇష్టపడలేదు. 'నీ సత్యనిరతికి మెచ్చితిని. నీవు నీకుమారునితో సుఖంబున నుండుము.' అని చెప్పి పంపివేసెను.

తల్లి ఇంటికి తిరిగివచ్చినప్పుడు బిడ్డయొక్క ఆనందమునకు మేరలేకుండెను.

---

## 27. ఒక క్షత్రియుడు, మంగలి.

అయోధ్యానగరమునందు కొంతకాలము క్రిందట ఒక క్షత్రియుడు ఉండెను. అతడు శివునిగురించి తపస్సు చేసెను. శివుఁడు ప్రత్యక్షమై ప్రాతఃకాలమున క్షౌరము చేయించుకొని

కత్తి చేతపట్టుకొని, నీయింటికివచ్చిన భిక్షుకుని కత్తితో మోది చంపిన యెడల, అతడు ఒక వరహాల కలశ అగును. అని చెప్పెను. చెప్పినప్రకారము చేయఁగా క్షత్రియుఁడు ధనవంతుఁడయ్యెను. ఇది చూచిన మంగలి తానుకూడ ధనవంతుఁడు కాఁగోరి, అతనిఇంటికి వచ్చిన భిక్షుకుని కత్తితో మోది, చంపి వేసెను. ఈసంగతి వినగానే రాజభటులువచ్చి మంగలిని కారాగృహమునకు తోడ్కొనిపోయిరి.

---

## 28. ఒక రోలు, మద్దెల.

ఒకనాఁడు ఒక మేళగాడు దాహము తీర్చుకొనుటకై వెళ్ళుచు తనమద్దెలను ఒకరి యింటిరోటిమీద ఉంచిపోయెను. అప్పుడు రోలు మద్దెలతో ఇట్లు అనెను. "ఓమృదంగరాజమా! నాబాధ ఎవరితో చెప్పను? పిండికొట్టుటకును, వడ్లు దంపుటకును, పచ్చళ్ళు రుబ్బుటకును, ఇంకను వేనవేలు పనులకు అర్ధరాత్రివరకు నన్ను జనులు బాధించుచుందురు." అందుకు మద్దెల ఇట్లు పలికెను. "నీబాధ ఒకబాధా? ఉక్కుతుండువలె ఉన్నావు. నాశరీరము చూడు కొయ్యముక్కలతోను, ఎండిన తోలుతోను, చేయబడినది. నిన్ను ఒకవైపునమాత్రము కొట్టుదురు. నన్ను రెండువైపులను బాదుచుందురు. నీకు రాత్రులందు కొంత విశ్రాంతికలదు. నన్ను రేయుంబవళ్ళు

మోదుచుందురు. తిన్నులు తినలేక ఎప్పుడును తెగమూల్గుచుందును. ఇదిగో! నా పాలిటి యముడు వచ్చుచున్నాడు. నాకు సెలవు ఇమ్ము." అంతలో మద్దెలవాడు వచ్చి మద్దెలను మెడకు తగిలించుకొని పోయెను.



## 29. తాబేలు—కొంగలు.

ఒక చెఱువులో ఒక తాబేలును, రెండు కొంగలును కలిసి వసించుచుండెను. ఒకనాఁడు చేపలు పట్టువాండ్రువచ్చి, చెఱువులోని చేపలను మఱుచటిదినము పట్టుకొనుటకు నిశ్చయించిరి. ఈమాటలు వినగానే కూర్మము చాల భయపడి, తన స్నేహితులైన కొంగలనుచూచి, "నన్ను మీరు రక్షింపవలెను. రేపటివఱకు నేను ఇచ్చట నున్నయెడల నన్ను చేపలవాండ్రు పట్టుకొని పోదురు. మీరు ఇద్దఱును నోటితో ఒక కఱ్ఱను కఱచి పట్టుకొనుఁడు. నేను ఆకఱ్ఱ మధ్యభాగమును నోటితో పట్టుకొందును. మీరు ఆకఱ్ఱతో వేఱు చెఱువునకు ఎగిరినపక్షమున నాప్రాణము దక్కును" అని చెప్పెను. ఆపరివారము మూడును బయలుదేఱినవి. కొంతదూరము పోవునప్పటికి క్రిందనున్న జనులు చప్పట్లుకొట్టిరి. వారిలో ఒకఁడు, 'ఇప్పుడు తాబేలు నోరుతెఱచినయెడల బాగుండును' అనెను. ఈపలుకులువిని, తాబేలు కోపముతో, 'నేను తెలివిమాలిన

దానవా నోరు తెఱచుటకు!' అనెను. ఈపలుకుతో తాబేలు క్రిందబడి చనిపోయెను. స్నేహితుడు మరణించినందుకు కొంగలు చాల దుఃఖించెను.



## 30. ఒక సింహాము, కుందేలు.

ఒక అడవిలో ఒక క్రూరమైన సింహాము నివసించుచుండెను. దాని ఆహారమునకై ప్రతిదినము ఒక మృగమును అది చంపుచుండెను. ఒకనాడు ఒకకుందేలు వంతువచ్చెను. అది తన్ను రక్షించుకొనుటకు ఒక యుక్తిని పన్నెను.

కుందేలు తనవంతు వచ్చినరోజున చాల ఆలస్యముగ సింహామువద్దకు వెళ్లెను. ఇంత ఆలస్యము ఎందుకు అయినది అని మృగేంద్రము కోపముతో అడిగెను. అప్పుడు కుందేలు ఇట్లు చెప్పెను. "స్వామీ! నేను వచ్చుచుండగా నాత్రోవలో ఒక సింహాము కనబడి, ఈవనమునకు తానే మృగరాజు అని పలికి, నన్ను అడ్డగించెను. నేను తిరిగివచ్చెదనని చెప్పి, బ్రతిమాలి తప్పించుకొని వచ్చితిని"అని మాఱుపలికెను. ఆక్రొత్త సింహామును జూపుమని ప్రాతసింహాము కోరెను. అప్పుడు కుందేలు దానిని ఒక లోతైన నూతిసమీపమునకు తీసికొని పోయి, తొంగిచూడుము అనెను. ఆసింహాము తన ప్రతిబింబమును రెండవసింహాముగ తలచి, ఆగ్రహముతో బావిలోనికి

దుమికెను; కొంతసేపటికి అది మృతినొందెను. కుందేటి ఉపాయమునకు వనములోని మెకములు అన్నియు సంతోషించెను.



## 31. బ్రాహ్మణుడు. నలుగురు దొంగలు:

యజ్ఞముచేయుటకు ఒకనల్లమేకను ఒక బ్రాహ్మణుడు సంపాదించి, దానిని ఇంటికి కొనిపోవుచుండెను. దానిని దొంగిలింపనెంచి నలుగురు దొంగలు త్రోవలో కూర్చుండిరి. మొదటివాడు బ్రాహ్మణునిచూచి, అయ్యా, బ్రాహ్మణులైన మీరు కుక్కను కొనిపోవుచున్నారేమి; అని అడిగెను. కొంత దూరము పోయిన తర్వాత రెండవవాడు ఎదురై, 'మీరు కుక్కనుకొనిపోవుటయేకాక వెఱ్ఱికుక్కనుకొనిపోవుచున్నారే?' అనెను. ఇద్దఱును ఒక్కవిధముగ జెప్పుటవలన తానుకొనిపోవునది కుక్క అయియుండునను సందేహము కలిగెను. మఱికొంత దూరము వెళ్ళినపిమ్మట మూడవదొంగ కనబడి, "ఏమయ్యా! మనుష్యులను కఱచి చంపుటకా ఈపిచ్చికుక్కను తీసికొనిపోవుచున్నావు!' అనెను. ఇప్పటికి తానుకొనిపోవునది వెఱ్ఱికుక్క అని నిశ్చయించి, దానిమెడనున్నత్రాటిని విప్పివేసెను. ఇంతలో నాలుగవదొంగ, "ఏమయ్యా, బాటసారులను కఱచుటకా దీనిత్రాటిని విప్పితివి? ఈవెఱ్ఱికుక్కను ఆచెట్టునకు కట్టిపొమ్మ, అప్పుడు ఉపకారము చేసినవాడవు అగుదువు' అనెను. ఆ తెలివి

తక్కువ బాపనయ్య ఆదొంగ చెప్పినట్లు చేసెను. తర్వాత నలుగురుదొంగలును వచ్చి, ఆభాగమును తమ గ్రామమునకు తీసికొని పోయిరి.

---

## 32. కూతునికై అల్లుని వెదకుట.

ఒక బొఱియలో ఒక తల్లిమెలుక తనపిల్లతో నివసించు చుండెను. పిల్లపెద్దదికాగానే మంచిమగనిని చూడుమని తల్లి మెలుక ఒకముసలి మెలుకతో చెప్పెను. సూర్యుడు చక్కని వాడు. అతనికిచ్చి పెండ్లిచేయుము. అని ముసలిది చెప్పెను. తల్లిమెలుక సూర్యునిదగ్గఱకు పోయి తనపిల్లను పెండ్లిఆడుమని వేడుకొనెను. నన్ను మేఘము నిమిషములో ఆవరించును. అది నాకంటె బలముకలది. దానికి నీబిడ్డను యిమ్ము. అని సూర్యుడు చెప్పెను. మేఘమును ప్రార్థింపగా గాలి నాకంటె గొప్పది. అని అది జవాబు యిచ్చెను. పిదప తల్లిమెలుక గాలిని బ్రతిమాలెను. నాకంటె గోడ గట్టిది. అని గాలి చెప్పెను. అప్పుడు తల్లిమెలుక గోడను ప్రార్థించెను. నాకంటె చిట్టెలుక గట్టిది. నన్ను అది సులభముగ త్రవ్వివేయును. అని గోడ పలికెను. అప్పుడు తల్లిమెలుక మనకులములోని వారే గట్టివారు. ఇతరులకొఱకు ఆశపడుట వెఱ్ఱితనము. అని

తలచి ఒక చిట్టెలుకను వరించి నిశ్చయించి వివాహకార్య
మును బాగుగ జరిపించెను.

---

## 33 పిల్లికి గంట కట్టుట.

ఒక దినము ఎలుకలు అన్నియు సభచేసి పాడుపిల్లి నుండి తప్పించుకొను ఉపాయమును గురించి చర్చ చేసినవి. చిట్టచివరకు పిల్లిమెడలో గంటకట్టుటకు తీర్మానము చేసినవి. అప్పుడు ఒక ముసలి ఎలుక లేచి మీ తీర్మానము బాగుగ నున్నది. కాని, పిల్లిని పట్టుకొనువారు ఎవరు? దాని మెడను గంట కట్టువారు ఎవరు? వారు లేచి నిలుపుడు అని పలికెను. అప్పుడు ఎలుకలు అన్నియు కుక్కిన పేలవలె మెదలకుండెను.

---

## 34 తోకలేని నక్క.

ఒక నక్క మిగిలిన మెకములతో పోరాడునపుడు అవి దానితోకను పీకివేసెను. ఆతోకలేని జంబుకము తన అంద వికారమును గూర్చి చింతించి, మిగిలిన నక్కలను పిలిపించి, ఇట్లు సంభాషించెను. తోక నడచునప్పుడు కాళ్ళకు అడ్డపడు చుండును. ఎవరుగాని తోకను పట్టుకొనినయెడల పారిపోవు టకు వీలుండదు. నేల మురికిగ ఉండినచో తోకవలన దేహ

మంతయు మలినము అగును. తోక లేకుండుటచే నేను ఎంత అందముగ ఉన్నానో మీరు చూచితిరా! కావున మీరు అందఱు నామాటవిని మీతోకలను పీకివేసికొనుడు. అప్పుడు ఒక నక్క లేచి, చాలు, చాలు, నీప్రసంగము. నీవు ఎంత అందముగ ఉన్నావో మాకు బాగుగ తెలియును. నీతోక తెగినది గనుక మమ్ములనుకూడ తోకలను పీకివేసికొనుము అని చెప్పుచున్నావు అని పలికెను. తోక తెగిన నక్క తలవంచుకొని దూరమునకు పాఱిపోయెను.

---

## 35. కుంటితైమూరు, ఒక సంగీత విద్వాంసుడు.

ఒకనాడు ఒక గ్రుడ్డివాడైన సంగీతవిద్వాంసుడు తైమూరుపాదుషాను సమీపించి, ఇంపుగ పాడెను. తైమూరు ఒక గవ్వను కూడ ఇయ్యక, సంగీతవిద్వాంసులుకూడ గ్రుడ్డివారుగ ఉందురా? అని ప్రశ్నవేసెను. విసుగుజెందియున్న ఆ గాయకుడు "పాదుషాగారూ! మేము అంధులము కాకపోతే కుంటివారిని ఆశ్రయించుట ఎట్లు తటస్థించును!" అనుచు వెడలిపోయెను.

---

# 36. శాస్త్రులవారి కుమార్తె.

ఒక శాస్త్రులవారి కుమార్తెను ఒక సోమయాజులుగారి కొమారునకు ఇచ్చి వివాహము చేసిరి. ఆపిల్ల ఒకరోజున వడ్డించుచుండగా, బంధువుడు ఒక్కడు ఉప్పు కావలసి, రాత్రులలో ఉప్పు పేరు చెప్పరు కనుక, "అమ్మాయీ! కొంచెము లవణము తెచ్చిపెట్టుము" అనెను. లవణము అనగా ఏమో తెలియునా అని మామగారు అడుగగా ఆసుందరి శాస్త్రులవారి యింటపుట్టి, సోమయాజులవారి యిల్లు చొచ్చి, లవణము అనగా తెలియదా అనుచు, ఆవుపేడ తెచ్చి విస్తరిలో వేసెను. అందఱును పకపక నవ్విరి.

---

# 37. వేపచెట్టు. తుంగ.

ఒక నదియొడ్డున ఒక వేపచెట్టును, తుంగయు పెరుగుచుండెను. గాలి వీచినపుడెల్లను తుంగ వంగుచు, గాలితగ్గినపుడు తిరిగిపైకి లేచుచుండెను. వేపచెట్టు తుంగను చూచి, వంగను లేవను, వంగను లేవను బాధపడుచున్నావు. నీ గతికి నాకు చింత కలుగుచున్నది" అని ఎగతాళి చేయుచుండెను. అందుకు తుంగ "నీవు గర్వింపవలసిన పనిలేదు. నేను వంగినను తిరిగి లేచుచుందును. నాకు ప్రాణహాని కలుగదు. నీవు వంగిన

పక్షమున తిరిగి లేచుట తటస్థింపదు" అని బదులు చెప్పెను.

కొన్ని దినములకు పెనుగాలివీచి వేపచెట్టు వేళ్లతో పెల్లగింపబడి నేలమీఁద బడెను. అప్పుడు వేపచెట్టు మిక్కిలి విచారమును పొంది తుంగతో "నీవు పలికినది సత్యము. నీకున్న తెలివి నాకు లేదు. గర్వముతో నిన్ను పరిహాసించినందులకు క్షమింపుము అని వినయముతో పల్కెను.



## 38. పక్షి, కోతి.

ఒకచెట్టుమీఁద ఒకపక్షి వసించుచుండెను. ఒకనాటి రాత్రి లోకము అంతయు ముంచివేయునట్లు వర్షము కురియుచుండెను. చెట్టుక్రిందనున్న ఒకకోతిని పక్షి జూచి, జాలిచెంది చెట్టు పైకివచ్చి కొమ్మల సందున నుండుమని చెప్పెను. కోతి సుఖముగ చెట్టెక్కి కూర్చుండెను.

కొంతసేపు అయినపిమ్మట పక్షి కోఁతినిచూచి, నీకు గూడు కట్టుకొనుట తెలియదు కదా! కాబట్టి, నీవు వర్షమునకును శీతమునకును బాధపడుచుందువు. మేము పక్షులము అయినను, గూండ్లుకట్టుకొని, పిల్లలను కాపాడుకొనుచు, సుఖముగ ఉందుము" అని గర్వముతో పలికెను. ఈ మాటల వలన వానరమునకు ఆగ్రహముగలిగి "నీవెంత? నీగూడెంత?

అని పలికి, గూటినివీకి పొఅవేసెను. గూడు క్రిందబడిపోయి, దానిలోని గ్రుడ్లు అన్నియు చితికిపోయెను.

---

## 39. అరుంధతీ నక్షత్రము.

పెండ్లిఅయిన తర్వాత పురోహితుఁడు ఒకకావు పెండ్లి కొడుకును వెలుపలకు పిలుచుకొని వెళ్లి అదిగో అరుంధతి, ఇదిగోఅరుంధతి, అని ఎన్నిసార్లు చూపినను, ఆనక్షత్రము కవబడలేదు. పెండ్లికొడుకునకు ప్రాణము విసిగి "అరుంధతీ నక్షత్రములేదుగాని, అఱువది వరహాల అప్పు కనబడుచున్నది. ఎంతసేపు ఇక్కడ నిలువవలెను? ఇక లోపలకు పోదము, రండు" అని పురోహితునితో పలికెను.

---

## 40. ఒక ఫిర్యాదు.

ఒక సాహేబు ఒక బ్రాహ్మణునికి ఒక వజ్రము ఇచ్చి నట్లును, దానిని బ్రాహ్మణుడు తిరిగి ఇయ్యనట్లును ఫిర్యాదు తెచ్చెను. ఒక మంగలి, ఒక చాకలి, ఒక వాద్యగాడు, ఈము గ్గురును సాక్ష్యమిచ్చిరి. న్యాయాధిపతి ముగ్గురు సాక్షులను మూడు వేర్వేరు గదులలో కూర్చుండబెట్టి, ఒక్కొక్కరికి కొంచెము బంకమట్టినిచ్చి, ఆమట్టితో వజ్రముయొక్క రూప

మును చేయుమనెను. మంగలి సానరాయివలెను, చాకలి చాకలిబానవలెను, వాదనగాడు మద్దెలవలెను చేసిరి. ఈరూపములవలన నిజమును న్యాయాధిపతి గుర్తెఱిగి వ్యాజ్యెమును కొట్టివేసెను.

---

## 41. ఒక మూఢవితంతువు.

ఒక మూఢవితంతువు క్షౌరము చేసికొనుటకు మంగలి కనబడక పోవుటచే మఱియొక స్త్రీతో ఇట్లు అనెను. 'మగడు లేని స్త్రీబతుకు దిక్కుమాలిన బ్రతుకుసుమా! నామగడు బ్రతికియుండినయెడల మంగలినైన పిలిచిపెట్టునుకదా! అనెను. అందుకు ఆస్త్రీ 'ఓసీ, మూఢురాలా! నీమగడు బ్రతికిఉండిన, నీకు మంగలితో పనియేమున్నది?' అని అడిగెను. అప్పుడు ఆ విధవ తల వంచుకొనెను.

---

## 42. ఒక యాచకుడు ఒక లోభి.

ఒక భిక్షుకుడు ఒక లోభియొద్దకు పోయి, నేను బీదవాడను. నాకు కొంచెము సొమ్మిచ్చి బ్రదికించవలసినది అనెను. అందుకు ఆలోభి యాచకుని చేతులు పట్టుకొని నీ బీదతనమునకు నేను చాల విచారపడుచున్నాను. ఏమిచేయగలను? సొమ్మెయియ్యవలసినది అని కోరక మఱిదేనినైన కోరుము.

నీకోరికను తప్పక నెఱవేర్చెదను. అని బదులుచెప్పి పంపి వేసెను.

---

## 43. ఒకవృద్ధబోధకుడు. ఒకయువకుడు.

ఒక మసీదునందు ఒకవృద్ధబోధకుడు మతవిషయములను బోధించుచుండగా ఒక యువకుడు నేత్రములనుండి కన్నీళ్లను బొటబొట కార్చుచుండెను. తానుచెప్పిన విషయముల వలన మనస్సు కరగి దుఃఖపడుచున్నాడు అని బోధకుడు తలచెను. బోధన ముగిసినపిదప శ్రోతలు అందఱును ఆపడుచు వానిని దుఃఖకారణము అడిగిరి. అందుకు అతడు 'మొన్నటివఱకు బ్రదికియుండిన నామేకకు బోధకునికి ఉండినట్లు ఒక గడ్డము ఉండెను. బోధకుడు మాటలాడునపుడు ఇటునటు కదలుచుండిన గడ్డమును చూచుటతోడనే నామేక జ్ఞప్తికివచ్చి దానిమరణమునకు దుఃఖించుచుంటిని.' అని బదులుచెప్పెను.

---

## 44. గ్రుడ్డివాండ్రు. ఏనుగు.

ఒక పట్టణమునందు నలుగురు గ్రుడ్డివాండ్రు ఏనుగును చూడగోరి, తమకోరికను ఒక మావటివానికి తెలిపిరి. అప్పుడు అతఁడు ఒక ఏనుగును తెచ్చి వారియెదుట పెట్టెను. కాలు

పట్టి చూచినవాడు బోలువలె ఏనుగు ఉన్నదనియు, తొండము చూచినవాడు రోకలివలె నున్నదనియు, చెవిపట్టి చూచిన వాడు చేటవలె నున్నదనియు, తోక పట్టిచూచినవాడు చీపురు వలె ఉన్నదనియు చెప్పిరి. ఇటులనే లోకులు యభిప్రాయ ములు అసంపూర్ణముగ ఉండునని మనము గ్రహించవలెను.

---

## 45. తెలికలవాడు, తార్కికుడు.

ఒక తెలికలవాడు నూనె గానుగ ఆడుచుండగా తర్కశా స్త్రము చదివిన పండితుడు వానియింటికిపోయెను. నూనెనుకొని బయటకు వచ్చునపుడు ఓరీ ఈఎద్దుమెడకు ఏల గంట కట్టితివి? అని అడిగెను. అందుకు గానుగవాడు ఆయ్యా నేను యింటిలో పనిచేసికొనుచు గానుగతోలుచుందును. గంట చప్పుడు వినునప్పుడు ఎద్దు తిరుగుచున్నదని నాకు గుఱుతు.' అనెను. "ఎద్దు నిలబడి తలను త్రిప్పినయెడల నీవు మోసపడిపోవా?" అని ప్రశ్నించెను. అప్పుడు తెలికలవాడు "స్వామీ నాఎద్దు తర్కము చదివి యుండలేదు." అని బదులు చెప్పెను. తార్కి కుడు నవ్వుచు తనయింటికి పోయెను.

---

## 46. ఒక లేకరి.

ఒక పల్లెటూరివాడు ఒకలేఖకుని యొద్దకు పోయి తన కొక జాబును వ్రాసిపెట్టుము అని కోరెను. తనకాలు నొప్పిగ

ఉండినందున జాబు వ్రాసి పెట్టఁజాలను అని లేఖకుఁడు చెప్పెను. అప్పుడు ఆపల్లెటూరివాఁడు లేఖకునితో నీవు ఎచ్చటకు పోవలసిన పనిలేదు. కూర్చుండియే యుత్తరమును వ్రాసి పెట్టుము, అని బతిమాలెను. అందులకు ఆలేఖరి నీవుచెప్పినది నిజమై యుండవచ్చును గాని, నేను వ్రాసిన దానిని నేనే చదువవలయును. ఇతరులు చదువఁ జాలరు. నాకాలు నొప్పిగానున్నందున నేను వ్రాసినజాబును చదువుటకు నేను రాజాలను కాబట్టి ఉత్తరమును వ్రాయుటకు వీలులేదు. అని చెప్పితిని. క్షమింపవలెను" అని బదులు చెప్పెను.

---

## 47. ఒక ధనవంతుడు, ఒక కవి.

ఒక కవి ఒక భాగ్యవంతుని సమీపించి అతని చేరువను కూర్చుండెను. ఇరువురకును మధ్యను ఒక జేన దూరము మాత్రము ఉండెను. భాగ్యవంతుడు తన సమీపమున కవి కూర్చుండుట సహింపక, కోపముతో పండ్లు పటపట కొఱుకుచు నీకును గాడిదకును భేదము ఎంత? అని కవిని అడిగెను. అప్పుడు కవి అయ్యా, నాకును గాడిదకును ఒక జేనదూరము మాత్రము కలదు. అని చిఱునవ్వుతో బదులు చెప్పెను. ధనవంతుడు సిగ్గుపడిపోయెను.

---

# 48. ఒక కాపుస్త్రీ, కోడి.

ఒక కాపుస్త్రీయొద్ద ఒక కోడి ఉండెను. అది దినమునకు ఒక గ్రుడ్డు పెట్టుచుండెను. తన కోడిచేత ఎక్కువ గ్రుడ్లు పెట్టించుటకుగాను ఆముసలిది ఎక్కువతిండి కోడికి పెటుట ప్రారంభించెను. అంతలో కోడి మిక్కిలి బలిసి, గ్రుడ్లుపెట్టుట మానివేసెను. అప్పుడు ఆవృద్ధురాలు, అయ్యో, లేనికంటికి మందువేయగా ఉన్నకన్ను ఊడిపోయెను, అనెడి సామెత నిజము అయినది. ఎప్పుడును అసంతృప్తి తగదు అని నిశ్చయించుకొనెను.



# 49. పక్షులు, మృగములు, గబ్బిలము.

ఒకప్పుడు పక్షులకును, మృగములకును యుద్ధము జరిగెను. అప్పుడు గబ్బిలము ఏపక్షములోను చేరక, యుద్ధము చూచుచుండెను. మొదట మృగములు గెల్చినవి. ఆసమయమున గబ్బిలము మృగములయొద్దకు వెళ్ళి, తన పండ్లు చూపి, వానితో స్నేహము చేసికొనెను. పిదప మృగములు ఓడిపోయి, పక్షులు జయించినవి. అప్పుడు గబ్బిలము తన రెక్కలను చూపి పక్షులతో మైత్రి చేసికొనెను. కొంత కాలమునకు పక్షులును, మృగములును స్నేహభావముతో ఉండుటకు స

మాధానము చేసికొనెను. అప్పుడు గబ్బిలముయొక్క నిజస్థితి తెలిసి ఉభయులును దానిని తఱిమివేసిరి. ఈకారణమువలన గబ్బిలము పగలంతయు దాగియుండి, రాత్రివేళలందు సంచరించు చుండును.

---

## 50. ఇద్దఱుస్నేహితులు, ఒకఎలుగుబంటి.

ఇద్దఱు స్నేహితులు ఒకరోజున ఒక అడవిగుండ ప్రయాణము చేయవలసివచ్చెను. మార్గమున ఒక ఎలుగుబంటి వీరికి కనబడెను. వారిలో ఒకడు దగ్గఱనున్న చెట్టును ఎక్కెను. రెండవవాడు ఏమియుతోచక, నేలమీద పడిఉండెను. ఎలుగు వచ్చి, వానిని వాసనచూచి, చచ్చెనని తలచి, వెళ్ళిపోయెను. కొంతసేపటికి వృక్షము ఎక్కినవాడు దిగివచ్చి, మిత్రునిచూచి, భల్లూకము ఏమి వక్కాణించినది? అని అడిగెను. అందుకు వాడు, 'నీవంటి యోగ్యులతో మైత్రి చేయవలదు.' అని చెప్పిన దని పలికెను.

---

## 51. స్వాములవారు, భగవద్గీతలు.

ఒక గ్రామములో ఒక స్వాములవారికి ఒక ఉద్యోగస్థుడు భిక్షచేసి, పంచభక్ష్యపరమాన్నములతో భోజనము పె

ట్టెను. భోజనమువలన కలిగిన ఆయాసమును స్వాములవారు తీర్చుకొనుచు కూర్చుండిఉండగా, ఆఉద్యోగస్థుడు స్వామిని చూచి, 'స్వామీ! భగవద్గీతలు పారాయణ చేయింతునా?' అని అడిగెను. అందుకు స్వాములవారు పొట్ట నిమురుకొనుచు, పారాయణ అనునది ఒక విధమైన పిండివంట అనుకొని, 'అయ్యో! ఇక పుచ్చుకొనలేనండి' అని బదులు చెప్పెను.

---

## 52. దిక్కులేనిది, నేత్రరోగము.

ఒక దిక్కులేనిదానికి కన్నులు కనబడనందున ఒక వైద్యునకు కన్నులు కుదురుటకు ఇరువదిరూపాయలు ఇచ్చుటకు ఒప్పుకొనెను. ఆవైద్యుడు మందువేయుటకు వచ్చునప్పుడెల్లను ఇంటిలో సామానులను కొన్నిటిని ఎత్తుకొనిపోవుచుండెను. కన్నులు కుదిరినవెనుక వైద్యుడు రూపాయలను అడిగెను. 'నేను ఇయ్యజాలను' అని దిక్కులేనిది చెప్పెను. అప్పుడు వైద్యుడు ఫిర్యాదు చేసెను. న్యాయాధిపతి పేదరాలిని పిలిపించి అడుగగా 'నాకన్నులు కుదిరినట్లు నాకు కొంచెము కూడ తెలియదు. పూర్వము నాయింటిలో ఎన్నోవస్తులు కనబడుచుండెడివి. ఇప్పుడు అవియేవియు కనబడుటలేదు. అని బీదది చెప్పెను. ఈ మాటలు విని, న్యాయాధిపతి చికిత్సకుని దూషించి, పంపివేసెను.

---

## 53. ఒక సింహము, ఒంటె.

ఒకానొక వనములో ఒక సింహము వసించుచుండెను. దానికి నక్కయు, కాకియు, పులియు మంత్రులు. ఒకనాడు వారికి ఒంటె గనబడెను. అది తనవారినుండి తప్పి వచ్చినందున దుఃఖించుచుండెను. దానిని వారు సింహముచెంతకు తీసికొనిపోయి, అభయము ఇప్పించి, సుఖముగ ఉండుము అని పలికిరి.

కొన్నాళ్ళకు సింహమునకు శరీరస్వాస్థ్యము తప్పెను. అది తన ఆహారమును సంపాదించుకొనలేకపోయెను. ఇట్టి స్థితిలో ఒంటెను చేటు కూర్పదలచి, ఆమంత్రులు ముగ్గురును ముందుగా సింహముతో మాటలాడి, ఒక ఉపాయమును పన్నినవి. అవి ఒంటెను కూడబెట్టుకొని సింహము దగ్గఱకు పోయినవి. కాకి, సింహమును చూచి, 'అడవిలో ఎంత వెదకినను ఆహారము దొరకలేదు. నేను జీవించి, ప్రయోజనము లేదు. నన్ను భక్షింపుము.' అనెను. సింహము అందులకు ఇష్టపడలేదు. నక్కయు కాకి చెప్పినట్లే చెప్పెను. పులియు అట్లే పలికెను. వీనికిని సింహము సమ్మతింపలేదు. వీనిని చూచుచున్న ఒంటె తన్ను చంపి తినుమని కేసరితో పలికెను. అది, పలికియు పలుకకమునుపే సింహము దానిమీదికి ఉఱికి, దానిని చంపి తినివేసెను.

---

## 54. తిమ్మరసు.

ఒకనాడు కృష్ణరాయలు కొలువుకూటమునందు కూర్చుండి, దానము లన్నిటిలో గొప్పది ఏది అని అడిగెను. ఒకడు అన్నదానము గొప్పది అని నుడివెను. మఱియొకడు విద్యాదానము గొప్పది అని పలికెను. ఇంకొకడు భూదానము శ్రేష్ఠమైనది అని చెప్పెను. రాజు తిమ్మరసు మంత్రిని అడుగగా అతడు 'నిదానము గొప్పది' అనెను. ఈపలుకున కు అందఱును సంతసించి, తిమ్మరుసును కొనియాడిరి.



## 55. ఒక బోయివాడు, చిలుక.

ఒక చెట్టు తొఱ్ఱలో ఒక చిలుక కాపురముండి, దానిలో పిల్లలనుపెట్టి,పొదుగుచుండెను. ఒకబోయవాడు ఆపిల్లలను పట్టుకొనిపోయి అమ్ముచు, జీవించుచుండెను. ఒకనాడు చిలుక బోయివానిని చూచి, 'అయ్యా! నాపిల్లల వలన నీకు ఏమి జీవనము జరుగును? నీవు ధనవంతుడవు అగు ఉపాయము చెప్పెదను." అనెను. అప్పుడు బోయవాడు దానిని తెలుపుము అని కోరెను. అప్పుడు చిలుక వానితో, 'ఆమఱ్ఱిచెట్టు తొఱ్ఱలో ఒక రత్నహారము కలదు. నిన్న ఒక కాకి దానిని తెచ్చి తొఱ్ఱలో వేసినది.' అని పలికెను. ఈసంగతికి బోయవాడు

చాల సంతోషించి, మఱ్ఱిచెట్టు ఎక్కి, దాని తొఱ్ఱలో చేయి పెట్టెను. అప్పుడు లోపల ఉండిన త్రాచు వానిని కఱచెను. దాని విషము శిరస్సునకు ఎక్కి, వాడు చనిపోయెను.



## 56. సింహము, చిట్టెలుక.

ఒకనాటి మధ్యాహ్నము తనగుహలో ఒక సింగము నిదురించుచు ఉండగా, ఒక చిట్టెలుక పరుగెత్తిపోవుచు, సింహమును తాకెను. అప్పుడు మృగేంద్రము మేలుకొని, దానిని పట్టుకొనెను. అప్పుడు చిట్టెలుక గజగజ వణకుచు, 'స్వామీ నేను తెలియకచేసిన తప్పును క్షమింపుడు. మీకు ఆపద సమయమునందు నేను పనికివత్తును.' అనెను. అందుకు మృగరాజు, 'ఓసీ! నీవా నాఆపదకు పనికివచ్చెదానవు? ఇప్పుడు క్షమించి విడిచిపెట్టితిని.' అని మాఱుపలికెను.

మఱియొక దినమున ఆసింహము ఒక వేటకాడు వేసిన ఉరిలో తగులకొని, దుఃఖించుచుండెను. ఆసమయమునకు చిట్టెలుక వచ్చి, దాని ఉరిత్రాళ్ళు కొఱికి, హర్యక్షమును రక్షించెను. అల్పజంతువులవలనను గొప్పవారి ఆపదలుకూడ తప్పగలవు.



# 57. భోజరాజు, బ్రాహ్మణుడు.

ఒకనాడు భోజరాజు ఉద్యానవనమునుండి వచ్చుచుండగా ఒక బ్రాహ్మణుడు అతనికి ఎదురు పడెను. అతని చేతిలో ఒక తోలుకమండలము ఉండెను. 'ఓవిప్రుడా! ఏల తోలుకమండలమును తెచ్చుచున్నావు?' అని ప్రశ్నించెను. ప్రశ్నించువాడు భోజరాజు అని గ్రహించి, 'భోజమహారాజు కాలమునందు శత్రువులకు తఱచుగ సంకెలలు వేయుచుండుటచేత ఇనుమును, శాసనములను పదేపదే వ్రాయించుచుండుట చేత రాగియు అరుదయినవి. కాబట్టి నాకు తోలుకమండులువు సంప్రాప్తమైనది' అని చెప్పెను. భోజరాజు అతని మాటలను మెచ్చుకొని, అక్షరలక్షలు ఇచ్చి పంపివేసెను.

---

# 58. దొంగలకు పంచాంగపు బ్రాహ్మణుడు తోడు.

ఒక గ్రామములోని దొంగలు కన్నము వేయుటకు మునుపు ఆయూరి పంచాంగపు బ్రాహ్మణునిచేత ముహూర్తము పెట్టించుకొనుచుండిరి. ఒకనాడు దొంగతనమునకు వెళ్ళునపుడు ఆబ్రాహ్మణుడు కూడ వారితో వెడలెను. వారు ఒక మధ్వాచార్యుని ఇంటిలో కన్నము వేసిరి. ఆనాడు ఏకాదశి, మఱునాడు ద్వాదశి, వేకువఝామున వంటచేసికొనుటకు కావలసిన

వస్తువులు వంటగదిలో నుండెను. దొంగలు అన్ని గదులలో ప్రవేశించి, దొరకిన సొమ్మును జాగ్రత్తపఱచుకొని, వంటగదిలోనికి వచ్చిరి. వంట అయినదనియు, భోజనముచేసి పోవునము అనియు పంచాంగవువిప్రుడు చెప్పి, దేవునికై వేద్యమునకు గంట వాయించెను. అప్పుడు ఇంటివారు అందఱును లేచి, నాలుగువైపులకును పాఱిపోవుచున్న దొంగలను, పంచాంగపు బ్రాహ్మణుని పట్టుకొని, పోలీసు వారికి ఒప్పగించిరి.

---

## 59. పిల్లలు, కప్పలు.

ఒకపాఠశాలలోని పిల్లలు కొందఱు ఒక చెఱువుగట్టు మీద కూర్చుండి, ప్రతిసాయంకాలము చెఱువులోని కప్పల మీద ఱాలు రువ్వుచుండిరి. ఒకనాడువారు ఱాలు రువ్వుచుండగా, ఒక కప్ప నీటిపైకి వచ్చి, ఇట్లు చెప్పెను. 'బాలకులారా! మేము బలహీనులము. మామీద ఱాళ్ళు విసరుట మీకు సంతోషముగ ఉండునుకాని, మాకు ఎంతబాధ కలుగుచున్నదో మీకు తెలియునా? మీఆటవలన మాప్రాణములు పోవుచున్నవి. జీవులను బాధపెట్టుట మానిన పక్షమున మీరు స్థిరమగు కీర్తిని సంపాదింతురు.' అనెను. ఆనాడు మొదలు ఆబాలురు అందఱును బుద్ధి తెచ్చుకొని, కప్పల మీద బండలను రువ్వుట మాని వేసిరి.

---

## 60. ఒక ఉపాధ్యాయుడు, ఒక విద్యార్థి.

కాంచీపురమునందు ఒక విద్వాంసుడు ఉండెను. అతడు అనేకులకు పాఠములు చెప్పుచుండెను. ఒకనాడు ఒక బాలుడు ఆయనను సమీపించి, అయ్యా! నన్ను శిష్యునిగ గ్రహించి, నాకు విద్యనేర్పుడు.' అని ప్రార్థించెను. ఆవిద్వాంసుడు, ఆబాలుని బుద్ధికుశలతను పరీక్షింపగోరి, 'అబ్బాయీ! దేవుడు ఎచ్చట ఉన్నాడు? అని ప్రశ్నించెను. ఆ మాణవకుడు, 'స్వామీ! దేవుడు ఎచ్చట లేడో తమరు మొదట సెలవు ఇచ్చిన యెడల, నేను ఎచ్చటెచ్చట ఉన్నది చెప్పెదను.' అని ప్రత్యుత్తరము ఇచ్చెను. బాలుని బుద్ధికి ఉపాధ్యాయుడు చాల సంతోషించి, వానిని శిష్యునిగ గ్రహించెను.



## 61. రూపాయకు రెండు చెప్పుదెబ్బలు.

ఒక సాహేబు ఒకకోమటి అంగటికిపోయి ఒక రూపాయ గోధుమలు ఇమ్మని అడిగెను. ఆవైశ్యుడు ఏదో లెక్క చూచుకొనుచుండెను. అప్పుడు సాహేబుకు కోపమువచ్చి, చెప్పుపుచ్చుకొని, కోమటిని ఒక దెబ్బకొట్టెను. సాహేబు మేజస్ట్రేటుతో ఫిర్యాదుచేసెను. ఆయనవిచారణచేసి సాహేబునకు ఒక అర్థరూపాయ జుల్మానావేసి, దానిని సెట్టికి ఇమ్మనెను. సాహే

బు తనజేబు తడవి చూచుకొని త్వరగా సెట్టి దగ్గరకుపోయి ఇం కొక చెప్పుదెబ్బకొట్టి ఒక రూపాయను ఇచ్చెను. అట్లు కొట్టు టకు కారణమును న్యాయాధిపతి పిలిచి అడుగగా "నాయొద్ద చిల్లరలేదు. అర్ధరూపాయకు ఒక చెప్పుదెబ్బ మీరుఏర్పరచిన దికదా! కనుక మరియొక దెబ్బకొట్టి ఒక రూపాయను ఇచ్చితిని అని పలికెను.

---

## 62. ఒకపులి—బ్రాహ్మణుడు

ఒక ముసలిపులి ఒక చెరువుదగ్గర కూర్చుండి ఆత్రోవ నఃపోవు ఒక విప్రునిచూచి "ఓ బ్రాహ్మణుడా! నాకు ముసలి తనము వచ్చినది. రేపోమరునాడో నేను చనిపోవుదును. నేను మరణించులోపల ఒక బ్రాహ్మణునికి సువర్ణదానము చేయవలెనని కోరిక కలదు. దైవసాహాయ్యమున నీవు నాకు కనబడితివి. నీవుచాలా మంచి వాడవుగ నున్నావు. నీకు దానము చేసినయెడల నాకు తప్పక స్వర్గము దొరకును. కాబ ట్టి నీవు ఈచెరువులో స్నానము చేసిరమ్మని అనెను. అందుకు అతడు "నీవు మనుష్యులను భక్షించు దానవు. నీ చెంతవచ్చు టకే భయముగనున్నది. అని బదులు పలికెను. అప్పుడు ఆ వ్యాఘ్రము ఒక బంగారు కడియమునుచూపి "ఇదిగో! బంగా రుకడియము. ఈబలహీనమైన స్థితిలో నేను ఎట్లు మనుష్యులను

చంపగలను అనెను. పేరాసకల బాపడు చెరువులో స్నానము చేసివిభూతిపూసికొని దానమును గ్రహించుటకు పులి యొద్దకు పోయెను. ఆపులి అతనిమీదకు దుమికి అతనిని చంపి తినెను.

---

## 63. ఒక చాకలి, వాని కుక్క, గాడిద.

ఒక గ్రామములోని చాకలికి ఒకకుక్కయు, ఒకగాడిదయు ఉండెను. కుక్క యజమానుని ఇంటిని రాత్రిలందు దొంగలురాకుండ కాపాడుచుండెను, గాడిద, వానిబట్టలను మోయుచు, వానికి సేవ చేయుచుండెను.

ఒకనాటి రాత్రి కుక్కయు, గాడిదయు దొడ్డిలో ఉండగా ఒక దొంగ దొడ్డిలోనికి వచ్చెను. అప్పుడు ఖరము శునకముతో, 'దొంగవచ్చినాడు. లేచి మొరుగుము, అనెను. అందుకు కుక్క, నాపనినాకు తెలియును. నీవునాకు చెప్పవలసిన పనిలేదు! అని బదులు పలికెను, గార్ధభమునకు కోపము వచ్చి, కుక్కను చూచి, నీపని నేను చేసెదను! అనిచెప్పి, గట్టిగా ఓండ్రపెట్టెను.

గాడిద అరుపునకు చాకలిమేలుకొని, విసుగుచెంది, ఒక కఱ్ఱతో గాడిదను బాదెను. ఇంతలో దొంగ పాఱిపోయెను.

---

## 64. ఒక భేరీ, ఇద్దఱు మూఢులు.

ఒక భేరీ వాయింప బడుచుండగా ఇద్దఱు మూఢులు విని భేరీలోపలను ఎవడో కూర్చుండి, శబ్దము చేయుచున్నాడు అని తలచిరి. ఆభేరీని వాద్యగాడు ఒకచోట ఉంచి దాహముకొఱకు పోగా, మూఢులు ఇద్దఱును భేరీ సమీపమునకు వచ్చి రెండు వైపులను పరీక్షింప మొదలు పెట్టిరి. ఒకవైపున ఉండిన తోలును ఒకడు పగలతీసి లోనికి తనచేతిని దూర్చెను తన రెండవ వైపున ఉండిన తోలును రెండవవాడు పగులగొట్టి లోనికి తనచేతిని దూర్చెను. వారు ఒకరిచేతిని ఒకరు పట్టుకొని, లోపలనున్నవాడు దొరకినాడు అని అఱచుచుండగా, వాద్యగాడు వచ్చి, భేరీని పగుల గొట్టినందులకు ఇద్దఱిని దవుడలు వాయించి పంపెను.

—— ——

## 65. ఒక పాండ్యరాజు, కోమట్లు.

ఒకనాడు పాండ్యదేశపురాజు ఒక క్రొత్త వెండిగంగాళమును చేయించి, తన దేశములోని కోమట్లను అందఱిని ఒక్కొక్క చెంబువంతున పాలు తెచ్చిపోయుడు అని ఉత్తరవు చేసెను. 'నేను చెంబెడు నీళ్ళను పోసినయెడల అందఱు తెచ్చిపోయు పాలలో భేదము కనబడదు.' అని ప్రతి వైశ్యుడు

ను తలచి, ఎవరినీటిని వారు ఇతరులకు తెలియక గంగాళము లో పోసి పోయిరి. రాజుగారు ప్రొద్దుఎక్కి చూడగా గంగాళము నిండుగ నీరు ఉండెను. అప్పుడు రాజునకు ఆగ్రహము కలిగి, కోమట్లను పిలిపించి, వారిని ఎందులకు శిక్షించకూడదో అడిగెను. అప్పుడు వారు చేతులను జోడించి, మహాప్రభూ! మాకు ఏవిధమైన చెడ్డఉద్దేశము లేదు. మీగంగాళము ఎన్నిచెంబులు నీళ్లుపట్టునో మొదట కనుగొనుటకు ఇట్లు చేసితిమి. దానికొలత మాకు ఇప్పుడు తెలిసినది కనుక రేపటినుండి దానినిండుగ పాలు తెచ్చిపోయుట మావిధి అని వచ్చుడు. అని పలికి తప్పించుకొనిరి.



## 66. దొంగ, మంగలము.

ఒకనాడు ఒక దొంగ ఒక ఇంటికి కన్నము వేసెను ఆఇల్లు ఒకదరిద్రునిది. దొంగకు ఒక మంగలము, దానిలో పేలపిండి తప్ప ఏదియు కనబడలేదు. అతను పేలపిండి తీసి. కొనిపోవుటకు నిశ్చయించి, తన కండువాను నేలమీద పఱచి, మంగలమును తెచ్చుటకు పోయెను. ఇంతలో ఇంటి యజమానురాలు మేలుకొని, ఆకండువాను తీసి దాచెను. దొంగ నట్టింటి వెన్నెలపొడను ఉత్తరీయముగ పరచి, దానిమీద పేలపిండిని పోసి, మూటకట్టుటకు ప్రయత్నించెను. అప్పుడు

అమ్మో, ‘అన్నా! నీ బావమీాద దయకలిగి ఒకకంబళివాను నీవు ఇచ్చితివి. నేనుకూడ చలికి చాల బాధపడుచున్నాను. నాకు ఒకదుప్పటి ఇచ్చి పొమ్మా.’ అని బ్రతిమాలెను. ఇంటివారు మేల్కొనిఉన్నందున భయపడి, ఆతస్కరుడు కాలికి బుద్ధి చెప్పెను.

---

## 67. మూడు మందులు.

ఒక గ్రామములో ఒకధనవంతుడు కలడు. అతనికి ఇద్దఱు పుత్రులు. వారికి ఏవిధమగు కొఱతయు లేదు. ఒకనాడు ఆధనికుడు ఒక గృహస్థుని యింటికి పోవలసివచ్చెను. అతడు లోపలికి పోవునప్పటికి అతని కుమాళ్ళు అల్యూమినియము కంచములు పెట్టుకొని, చోడి అంబలిని జుఱ్ఱుచుండిరి. ఆ పిల్లలు చక్కని శరీరము కలవారై ఆరోగ్యముతో నవనవలాడుచుండిరి. వారిని చూచి ఆశ్చర్యపడుచు, ఆ లక్షాధికారి అతనితో ఇట్లు అనెను. ‘నీబిడ్డలను చూడగా నాకు మిక్కిలి సంతోష మగుచున్నది. నాకొమాళ్ళను భూమిమీాద అడుగు పెట్టనీయక సేవకులు త్రిప్పుచుందురు. అమృతమువంటి ఆహారమును వారికి పెట్టించుచుందును. ఎట్టి జాగ్రత్తపడినను, వారు దినదినము ఏదో రోగముచే బాధపడుచుందురు. వైద్యుడు ఇంటికి రానిదినము ఉండదు. నీబిడ్డలకు నీవు ఏమందులు

ఇచ్చెదవో నాకుదయచేసి తెలుపుము' అనెను. అందుకు ఆగృహస్థుడునవ్వుచు ఈలాగుపలికెను. 'మాయొద్ద బిడ్డల ఆహారసంబంధమగు మందులు మూడు కలవు. అవి ఏవి అనగా, 1. కరకర ఆకలి అగునప్పుడే అన్నము పెట్టుట. 2. భోజన సమయములందే భోజనము పెట్టుట. 3. చిఱుతిండ్లను పెట్టకుండుట.' ఈ మాటలు విని, తానుకూడ ఈపద్ధతిని అవలంబించెద నని చెప్పి ధనికుడు వెడలిపోయెను.



## 68. ఒక నక్క, కోళ్లు.

ఒకఇంటిలో కోళ్లుఅన్నియు రాత్రిపూట పంజరములో ఉండుట ఒక నక్కచూచి, పంజరమును ఎత్తలేక, దానివెలుపల కూర్చుండి, కోళ్ళతో ఇట్లు అనెను. నేను చెప్పునది సావధానముగ వినుడు. రేపటినుండి లోకములోని జీవజంతువులు అన్నియు వైరమును విడిచిపెట్టి, ఒద్దికతో ఉండవలసినట్లు తీర్మానము అయినది. కాబట్టి మీరు వెలుపలకు వచ్చినయెడల మనము అందఱము సుఖముగ కాలము గడుపుదము. ఇంతలో ఒక ముసలికోడి, 'ఈసంగతిని నీవు మాకు చెప్పినందులకు కృతజ్ఞులము. కొంతసేపు నిద్రపోయి లేచినపిమ్మట నీ మాటకు బదులు చెప్పెదము. నీవు ఇచ్చట కూర్చుండిన

కావలికుక్కలు నిన్ను చంపునేమో?' అనెను. కుక్కలు అను మాట వినగానే నక్క దౌడుతీసి పరుగెత్తి పోయెను.

---

## 69. ఒక కొంగ, ఒక హంస.

ఒకానొక బూరుగు చెట్టుమీఁద ఒక కొంగ కాపురము చేయుచుండెను. ఒకనాఁడు సమీపమున పోవుచుండిన హంసను చూచి, కొంగ ఇట్లు అడిగెను. 'నీశరీరము తెల్లగ ఉన్నను, ముక్కును, కాళ్లును ఎఱ్ఱగ నున్నవి. నీవు ఎవరు? నీనివాసస్థానము ఏది? నీవు వేనిని తిందువు?' అందుకు హంస ఇట్లు బదులు చెప్పెను. 'నాపేరు హంస. నేను మానససరోవరములో ఉన్నాను. అచ్చటి వస్తువులు అన్నియు దేవనిర్మితములు. అచ్చటిభూమి అంతయు బంగారు భూమి. నీరు అమృతమువలె ఉండును. కోరిన వస్తువులను ఇచ్చు వృక్షములు అక్కడ ఉన్నవి. మేము కమలముల తూండ్లను తిందుము.' అప్పుడు కొంగ పకపక నవ్వి!, 'మానససరోవరము బహు రమణీయమైన చోటట! కప్పలు, చేపలు లేని చోటునందు ఏమి స్వారస్యము ఉండును?' అని పరిహాసము చేసెను. ప్రతివారును వారికి ఇష్టమైన పదార్థములనే శ్రేష్ఠములు అందురు.

---

# 70. మూడు చేపలు.

ఒక కొలనిలో మూడుచేపలు ఉండినవి. ఎండకాలము సమీపించుటచే దానిలోనినీరు ఎండిపోవుచుండెను. ఈసంగతి గ్రహించి, వానిలో బుద్ధిశాలియగు చేప మిగిలిన రెండుచేపలను పిలిచి, 'కొలనిలోని నీరు త్వరలో ఎండిపోవును. అప్పుడు జెస్తవాడు మనలను పట్టుకొని పోవును. గనుక వేఱొకచోటికి మెల్లగ పోదము' అనిచెప్పెను. దానిమాటను ఆచేపలు పెడచెవిని పెట్టెను. కనుక ఆ చేప మెల్లగా జరిగిపోయి, సముద్రములో చేరెను. రెండుమూడు దినములలో జెస్తవాడు వచ్చి వలవేసి, ఈరెండుచేపలను ఒడ్డునవేసెను. వీనిలో ఒకచేప చచ్చినట్లు పడియుండెను. రెండవది ఇటునటు కదలుటచే జెస్తవాడు దానిని నేలమీాద బాది చంపెను. ఇంతలో చచ్చినట్లు పడియుండినచేప మెల్లగ కదలి నీటిలో ప్రవేశించి, తప్పించుకొనెను. ముందుగ తప్పించుకొనుటకు ఉపాయమును వెదకువాడు బాగుగ సుఖపడును అనియు, సమయమున ప్రయత్నము చేయువాడు కొంత సుఖపడును అనియు, ప్రయత్నము చేయక ఉండువాడు చెడిపోవును అనియు ఈకథ మనకు బోధించుచున్నది.

---

## 71. దొంగ, మడిబట్ట.

ఒక గృహస్థుని దొడ్డిలో ఒక కొబ్బరిచెట్టు ఉండెను. ఒక దొంగ ప్రతిరాత్రి ఆచెట్టు ఎక్కి, కొన్ని కాయలు ఎత్తుకొనిపోవుచుండెను. ఏమిచేయునది తోచక, గృహస్థునిభార్య మగనితో, 'ఈరాత్రి మనము ఇద్దఱము మేలుకొనియుండి, దొంగను పట్టుకొందము' అనెను. అప్పుడు భర్త, 'అట్లుకాదు. నాకు ఒక క్రొత్తఊహ తోచినది. నామడిబట్టను చెట్టునకు కట్టుదము. దొంగ బ్రాహ్మణేతరుడు కనుక నామడిబట్టను ముట్టుకొనడు. అప్పుడు మన కాయలు మనకు దక్కును' అనెను. అతని భార్య ఈయుపాయమునకు చాల సంతోషించెను.

వారు అనుకొనినప్రకారము చెట్టుకు మడిబట్టను కట్టి సుఖముగ నిద్రపోయిరి. తెల్లవాఱి చూచునప్పటికి మడిబట్టయు, కాయలును మాయమై ఉండెను. దంపతులు మిగుల దుఃఖించిరి.

---

## 72. ఒక వైదికుడు, ఒక లౌకికుడు.

ఒక రాజుగారియొద్ద ఉద్యోగమునకై ఒక వైదికుడును ఒక లౌకికుడును వచ్చిరి. ఇద్దఱి తెలివిని పరీక్షించుటకుగాను ఆరాజు తన ఏనుగు ఎంత బరువున్నదో తెలిసికొను మార్గ

మును విశదపఱచుడని వారిని కోరెను. ఏనుగును జంపి, ముక్కలుచేసి, వానిని తూచిన పక్షమున ఏనుగు బరువు తెలియును అని వైదికుడు చెప్పెను. లౌకికుడు ఇట్లు చెప్పెను. 'మన కాలువమీద నున్న బల్లకట్టుమీద ఏనుగును ఎక్కించి, బల్లకట్టు ఎంతవఱకు మునిగినదో గుర్తించి, ఏనుగును దింపి, మొదటిఆనవాలువఱకు బల్లకట్టుమీద తూనికరాళ్ళను వేసినచో ఏనుగు బరువు తెలియును'. లౌకికుని జవాబుకు రాజు సంతోషించి, అతనికి ఉద్యోగమును ఇచ్చెను.



# 73. భోజరాజు, అతనిమంత్రి.

భోజరాజు తన ధనమును ధారాళముగ ఖర్చుపెట్టుట అతని మంత్రి చూచి, రాజుగారు పండుకొను గదిగోడమీద 'ఆపత్కాలమున ఉపయోగపడుటకై ధనమును రక్షింపవలెను.' అని వ్రాసెను. రాజు దానిని చదివి, దానిక్రింద, 'శ్రీమంతులకు ఆపదలు రావు' అని వ్రాసెను. రెండవనాడు మంత్రి దీనిని చదివి, దీని దిగువన 'శ్రీ తొలగిపోయినయెడల' అని లిఖించెను. మఱునాడు రాజు దీనిని గమనించి, అట్లగుచో, జాగ్రత్తచేసినను ధనము నిలువదు' అని తిరిగి వ్రాసెను. అంతట మంత్రి రాజునకు కనబడి, క్షమింపు మని ప్రార్థించెను.



# 74. రామకృష్ణుడు, గూనిచాకలి.

ఒకనాడు రామకృష్ణుడు రాజుగారిని పరిహాసము చేయుగా వారు నౌకరులను పిలిపించి, ఏనుగుచే రామకృష్ణుని త్రొక్కించుడని సెల విచ్చిరి. వారు అతనిని ఊరి బయటకు తోడ్కొనిపోయి, అచ్చట ఒక పల్లము త్రవ్వి, దానిలో రామకృష్ణుని కంఠమువరకు పూడ్చివేసి, ఇభమును తెచ్చుటకు వెళ్ళిరి. ఇంతలో ఒకగూనిచాకలి, ఆత్రోవను పోవుచు, రామకృష్ణుని చూచి, ఎవరు నిన్ను ఇట్లు పూడ్చిపెట్టిరి; అని అడిగెను. అప్పుడు రామకృష్ణుడు ఇట్లు చెప్పెను. 'నాకు అనేక సంవత్సరములుగా గూనుకలదు, ఇట్లు పూడ్చి యుంచిన కొన్నిదినములలో గూనుపోవును అని చెప్పిరి. నన్ను వెలుపలకు తీసిచూడుము.' ఆచాకలి రామకృష్ణుని బయటకుతీసి చూడగా గూనులేక అతడు చక్కగ నుండెను. తన్ను ఆగుంటలో పూడ్చిపెట్టుమని రజకుడు కోరగా రామకృష్ణుడు అట్లు చేసెను. చాకలితో సాయంకాలము వఱకు గుంటలో ఉండుమని చెప్పి, వానిమూటను భుజముమీద వేసికొని, రాజుగారి సముఖమునకు రామకృష్ణుడు వచ్చెను. రాజు ఆశ్చర్యపడి, ఎట్లు తప్పించుకొని వచ్చితివి అని ప్రశ్నించెను. జరిగినది యావత్తు తెలుపగా రాయలవారు రామకృష్ణుని తెలివికి మెచ్చుకొని, అతని తప్పును క్షమించిరి.

---

## 75. ఆడిదము సూరకవి.

ఒకనాడు సూరకవి ఒక పెద్ద తాటాకుల పుస్తకము చదువుచు పోవుచుండగా, ఒక వెలమదొర అతనిని చూచి, 'ఈవేళ వర్జ్యము' ఎప్పుడు అని ప్రశ్నించెను. అందుకు సూరకవి నాకు పంచాంగము చెప్పుట తెలియదు అనెను. అప్పుడు ఆవెలమదొర పరిహాసముగా, 'చేత పెద్దపుస్తక మున్నది. పంచాంగము చెప్పుటరాదు.' అనెను. రెండవనాడు ఆదొర ఒక పెద్దకత్తిని పట్టుకొని పోవుచుండగా, సూరకవి 'క్షురకర్మ చేయగలవా' అని అతనిని అడిగెను. అతనికి కోపమువచ్చి, నేను మంగలని అనుకొంటివా అని పలికెను. అప్పుడు పరిహాసముగా సూరకవి, 'చేతనుండు కత్తి చాలపొడవు. క్షురకర్మకు పనికిరాని కత్తి ఎందులకో?' అని తనదారిని పోయెను.

---

## 76. కడుపు, అవయవములు.

ఒకప్పుడు అవయవములు అన్నియు కడుపుతో తగవులాడి, తమపనులను మానివేసెను. కొన్నాళ్ళలో కాలుసేతులు సన్నగిలి, ఎండిన తోటకూరకాడలవలె వడలిపోయెను. కన్నులు గుంటలుపడెను. చెవులకు వినుశక్తి తగ్గెను. నోరు ఎండిపోయెను. దేహము కృశించెను. అప్పుడు లోపల ఉన్న బుద్ధి అవయవములను పిలిచి, 'మీరుమాత్రము పనిచేయుచు,

కడుపు ఊరక ఉండునని మీరు తలచుచున్నారు. ఇది తప్పు. మీరు తెచ్చిపెట్టు ఆహారమును కడుపు నెత్తురుగా మార్చి అవయవములకు అన్నిటికిని బలమును కలిగించుచున్నది. మీరు బలము లేనిచో, మీపనులను మీరు చేయజాలరు. కాబట్టి మీరు మీపనులను చేసికొనుచుండుడు' అని చెప్పెను. అప్పటినుండి అవయవములు అన్నియు తమ పనులను చేయుచు, కడుపుతో సఖ్యముగ ఉండెను.

---

## 77. ఒక పరీక్షాధికారి.

ఒకనాడు ఒక పరీక్షాధికారి ఒక పాఠశాలకు పోయి ఒక బాలుని చూచి, 'దేవుడు మనకు ఒక నోటిని మాత్రము ఇచ్చి, రెండు చెవులను ఎందుకు ఏర్పాటు చేసెను?' అని అడిగెను. ముఖమునందు రెండు నోళ్లు పెట్టుటకు తావు లేదని బాలుడు చెప్పెను. ఆప్రశ్నను ఇంకొక బాలుని అడిగెను. అతడు, 'ఒక వైపున ఒక చెవిమాత్రము ఉంచినయెడల వికారముగ ఉండునని తెలిసి, చెవులను రెండువైపుల ఏర్పాటుచేసినాడు' అని జవాబు పలికెను. ఆ జవాబు కూడ పరీక్షాధికారికి నచ్చలేదు. ఇప్పుడు ఇతరులను అడుగగా, ఆసుందరి, ఒక చెవిలో వినునది రెండవచెవిగుండ పోవుటకై రెండుచెవులను దేవుడు మనకు ప్రసాదించి యున్నాడు. అని ప్రత్యుత్తర

ము ఇచ్చెను. బడి బాలుర స్థితిగతులను ఆలోచించి చూడగా కమల చెప్పిన మాటలందు నిజమున్నట్లు పరీక్షాధికారి మనస్సునకు తట్టెను. కావున అతడు కమలను చాల మెచ్చుకొనెను.

---

## 78. ఒక టక్కరి బాలుడు.

ఒకనాడు ఒక బాలుడు మురుగులు, గొలుసులు పెట్టుకొని ఊరిబయట ఒక బావి దగ్గర ఆడుచుండెను. అప్పుడు వాని యొద్దకు ఒకదొంగ రాగా, ఆపిల్లవాడు వెక్కి వెక్కి ఏడ్వసాగెను. ఆచోరుడు ఏల ఏడ్చుచున్నావు. అని బాలుని అడిగెను. అప్పుడు వాడు, 'నాచంద్రహారము నూతిలోపడిపోయినది. ఇంటికి పోయిన పక్షమున మానాయన నన్ను చంపి వేయును.' అనెను. అప్పుడు తనబట్టలను గట్టుననుంచుమని చెప్పి, ఆ స్తైనుడు గోచిని పెట్టుకొని, కూపము లోనికి దిగెను. వాడు దిగి దిగకముందే వాని బట్టలను చంక పెట్టుకొని, బాలుడు దౌడు తీసెను.

---

## 79. బ్రాహ్మణులకు వాతలు.

కృష్ణరాయుని తల్లి తన మరణ కాలమునందు ఒక మామిడిపండు తెచ్చిఇమ్మని కోరెను. ఆపండు తెచ్చి ఇచ్చు

లోపల ఆమె చనిపోయెను. రాయలు పండితులను రావించి 'ఏమిచేసిన తల్లికి తృప్తి కలుగును?' అని అడిగెను. వారు చెప్పిన ప్రకారము బంగారు మామిడిపండ్లు చేయించి, బ్రాహ్మణులకు దానము చేసెను.

ఇదిచూచి, తెనాలి రామకృష్ణుడు ఆవిప్రులను ఎల్లరను తన గృహమునకు తీసికొనిపోయి కాల్చిన గరిటెకాడతో వారికి వాతలు వేసెను. వారు గొల్లున ఏడ్చుచు రాయలవారితో చెప్పిరి. రాయలు రామకృష్ణుని పిలిపించి, 'ఇది ఏమిపని?' అని ప్రశ్నించెను. అప్పుడు కృష్ణుడు 'అయ్యా! మామాతకు వాయురోగము వచ్చి వాతవేయులోపల ఆమె స్వర్గస్తురాలయ్యెను. ఆమె ఆత్మకు శాంతి కలుగుటకు ఇట్లు చేసితిని;' అని విన్నవించెను. రామకృష్ణుడు తనకు బుద్ధి చెప్పుచున్నాడని రాజు తలచి, తెలుసుకొనెను.

## 80. ఒక మంత్రి కొడుకు పుష్పములు.

ఒక రాజుగారికి ఒక పెద్దపువ్వులతోట ఉండెను. ప్రతి దినము అతని మంత్రికొమారుడు పువ్వులను దొంగిలించుకొనిపోవుచుండెను. దొంగను శిక్షించుటకుగాను తోటవాని ఒకనాడు ఆపిల్లవానిని వాడుకోసిన పువ్వులతో పట్టుకొని ఒక బండిలో రాజుగారి సమ్ముఖమునకు తీసికొనిపోయెను. తోవ

లో మంత్రి కనబడగా జరిగిన సంగతిని మంత్రికి తెలిపెను. అప్పుడు మంత్రి, కుమారునకు వినులాగున గట్టిగా, 'నేను ఏమి చేయుదును?, నా పిల్లవానికి నోరు ఉండినయెడల, వాడు బ్రదుకును' అనిపలికెను. ఈకేకను గ్రహించి లోపలనుండిన బాలుడు పువ్వులను అన్నిటిని పీకివేసెను. రాజుగారియొద్దకు ఫిర్యాదు తెచ్చినప్పుడు తోటమాలి పువ్వులను పూజకు పంచలేకపోయెను. కాబట్టి నేరము ఋజువు కాక మంత్రికొడుకు తప్పించుకొనెను.

---

# 81. యుక్తిగల కోమటి.

ఒకనాడు ఒకదొంగ ఒక వైశ్యుని యింటిలో ప్రవేశించి, అటుకమీద దాగియుండెను. కోమటి రాత్రిభోజనము చేసి పరుండబోవునప్పుడు ఆదొంగ అతని కంటబడెను. అట్లయినయెడల వాడు క్రిందికి ఉఱికి, తనకు అపాయము చేయును అని తలచి, ఆవైశ్యుడు తన భార్యతో, 'ఇప్పుడు ఈయూరిలో దొంగలు ఎక్కువగ ఉన్నారు. నీనగలను ఇటు తెమ్ము' అని చెప్పుచు, ఒకపెట్టెను తెఱచి సవరించుచున్నట్లు నటించి, 'అబ్బో! తేలుకుట్టినది.' అని పెద్ద అఱపు అఱచెను. ఇరుగుపొరుగువారు పరుగెత్తుకొని వచ్చి, మందులువేసి, ఏమిజరిగినదా అని అడిగిరి. అప్పుడు వైశ్యుడు, 'అయ్యలారా! ఏమ

ము దగ్గరదిగాని, అటుకమీది దొంగ దిగను అనుచున్నాడు' అని పలికెను. తోడనే అందఱును చోరుని పట్టుకొని, గ్రామ మునసబుగారికి ఒప్పగించిరి.

---

## 82. కోతి, దానినీడ.

ఒకకోతి ఒక నూతిప్రక్కను కూర్చుండి, ఒక చూత ఫలమును చీకుచు, నూతిలో తొంగిచూచెను. కూపములో పల వేఱొక కోతి మామిడిపండును చీకుచున్నట్లు దానికి కన బడెను. ఆకోతిని బెదరించి, దానిపండును కూడ తీసికొనుటకు నిశ్చయించి, కిచకిచమని అఱచెను. అప్పుడు దానినోటిలోని మామిడిపండు బావిలో పడిపోయెను. అప్పుడు ఆవానరము చాల దుఃఖించుచు పోయెను. దురాశగలవాని మనుపు ఉన్నది సైతము పోవును.

---

## 83. తెనాలి రామకృష్ణుని గుఱ్ఱము.

కృష్ణదేవరాయలు తన పండితులను ఒకసారి పిలిపించి, వారివారి గుఱ్ఱములను చక్కగ మేపి, నెలలో తనకు చూప వలసినది అనియు, బహుమానములను ఇచ్చెదను అనియు చె ప్పెను. అందఱును తమతమ అశ్వములను బాగుగ పోషించు

చుండిరి. రామకృష్ణుడుమాత్రము తన హయమును ఒకఇంటి లో ఉంచి, తాళమువేసి, గోడకంతగుండ రోజునకు నాలుగు పరకల గడ్డిని విడల్చుచుండెను. మాసము కాగానే, గుఱ్ఱము లను అన్నిటిని రాజుగారు పరీక్షించి, మిగుల సంతసించి, రామకృష్ణుని గుఱ్ఱమును తెమ్మనిరి. దానిని పట్టుకొనుట కష్టము అని రామకృష్ణుడు సెలవు ఇయ్యగా, రాజుగారు ఒకతురకరౌతును పంపిరి. అతడు గుఱ్ఱమును చూచుటకుగాను కంతలో తలదూర్చగా, మేకకై మొగము వాచిన గుఱ్ఱము రౌతు గడ్డమును పట్టుకొని పీకెను. గడ్డమును కత్తిరించుకొని రౌతు ప్రాణమును దక్కించుకొని, రాజుగారివద్దకు వెళ్ళి, 'మహాప్రభూ! ఆగుఱ్ఱముయొక్క మదము ఇంతింత అని చెప్పుటకు వీలులేదు.' అనెను. రాజుగారు స్వయముగాపోయి గుఱ్ఱమును చూచి ఎందుకు మేపలేదు అని రామకృష్ణుని అడిగిరి. అందుకు రామకృష్ణుడు 'ఇప్పటికే దీని మదము ఇట్లున్నది. దీనిని లెస్సగ మేపియుండిన యెడల పట్టుకొనుట ఎవరితరము?' అని బదులు చెప్పెను. ఈపలుకునకు రాజుగారు హర్షించిరి.



## 84. ఒక గడుసు సాక్షి.

ఒక గడుసరి సాక్ష్యము ఇచ్చుటకు ఒక న్యాయస్థానమునకు పోయెను. అప్పుడు న్యాయాధిపతి వానిని చూచి

'నీవయస్సు ఎంత;' అని అడిగెను. 'నాకు ఇరువదియవయేడు' అని వాడు చెప్పెను. అప్పుడు న్యాయాధిపతి 'నీవు క్రిందటి సంవత్సరము సాక్ష్యము ఇచ్చుటకు వచ్చితివి. అప్పుడు కూడ నీవయసు ఇరువదియవయేడు' అని చెప్పితివి. ఏల? ఇట్లు అబద్ధము లాడుచున్నావు? అని ప్రశ్నించెను. అప్పుడు ఆగడుసువాడు 'ప్రభో! నేను అప్పుడొకమాట, ఇప్పుడొకమాట చెప్పువాడను కాను నామాట ఎప్పుడును ఒక్కటిగా ఉండును;' అనిబదులు చెప్పెను.



## 85· ఒక బ్రాహ్మణుడు.

ఒక విప్రుడు ఒక దారిని పోవుచుండగా, ఒక సాహేబు అతనికి ఎదురుపడి, 'కోన్ హై? అనెను. అందుకు బ్రాహ్మణుడు నాపేరు కోనాయికాదు. నాపేరు కోటయ్యసుమీ. అనెను. ఆసాహేబు అంతతో పోక 'కై సాజాతే?' అని ప్రశ్నించెను. ఆ బ్రాహ్మణునికి బొత్తిగా హిందూస్థానిరాదు. సంధ్యావందనము జ్ఞప్తికివచ్చి 'ఉత్తమే శిఖరేజాతే భూమ్యాం పర్వతమూర్ధని' అనుచు పోయెను. ఇతడు పిచ్చివాడు అని తలచి సాహేబు తన త్రోవను తాను వెళ్లెను.



# 86. కన్నము వేయుట బోగము దాని తప్పు.

ఒకని యింట ఒకరాత్రి కన్నపు దొంగతనము జరిగెను. అప్పుడు న్యాయాధిపతి ఆయింటి యజమానుని పిలిచి, గోడలు సులభముగా కన్నము పడునట్లు ఏల కట్టించితివి. అని అడిగెను. అందుకు అతడు, 'అది నాలోపముకాదు. గోడపెట్టిన కూలివాండ్ర లోపము' అనెను. ఆకూలివాండ్రను పిలిపించి, వారిని అడుగగా, అది తమ తప్పు కాదు అనియు, మట్టి పిసికినవాండ్ర దోషము అనియు వారు తెలిపిరి. మట్టి పిసికినవారిని అడుగగా, 'మేము మట్టి కలుపునప్పుడు ఒక బోగముది ఆత్రోవను పోవుచుండెను. అప్పుడు మామనస్సులు మాస్వాధీనములో లేవు. కనుక శిక్షకు పాత్రురాలు ఆ బోగము స్త్రీయే' అని పలికిరి.

---

# 87. ఒక బంట్రోతు.

ఒక కరణముగారు తన తండ్రి తద్దినము పెట్టుచుండగా, తహాశ్శీలుదారు వద్దనుండి ఒక తురకబంట్రోతు ఒక తాకీదు తీసికొనిపోయి, కరణమునకు ఇచ్చెను. తద్దినము ముగిసిన తర్వాత తాకీదుకు జవాబు వ్రాసి ఇచ్చి బంట్రోతును గారెలు,

అప్పములు, క్షీరాన్నములతో అన్నము పెట్టించెను. ఆబంట్రోతు కడుపార భోజనముచేసి, 'ఈరోజ్ మీాకీ ఇంట్లో ఏమ్హోయి?' అని కరణముగారిని అడిగెను. 'మాయింట్లో తద్దినము' అని కరణము చెప్పగా విని, తద్దినము అనగా ఏదో శుభకార్యము అనుకొని, ఆబంట్రోతు 'కరణము సాహేబూ మీాకీ ఇంట్లో రోజ్ రోజ్ తద్దినమ్, తద్దినమ్ వుండాల్ నామీా!' అనుచు వెడలి పోయెను.

---

## 88. ఒక పెద్దపులి, మృగములు.

ఒక అరణ్యమునందు ఒక పెద్దపులి ఉండెను. అదికనబడిన మృగములను అన్నిటిని చంపుచుండెను. ఒకనాడు ఒక వృషభమము దాని కంటబడెను. దానిమీాదికి ఆ వ్యాఘ్రము ఎగిరి దుమికెను గాని, దైవాధీనమువలన గురితప్పి, అది ప్రక్కనున్న గోతిలో పడెను. గోతిలోపడిన శార్దూలమును మృగములు చూచి ఈసమయమునందు దీనిని చంపకపోయిన యెడల తిరిగి ఇది బాధించును అని తలచి ఒకొక్క మృగము ఒకొక్క రాయి వంతున దానిమీాద వేసినవి. వేసిన రాళ్ళక్రింద పులి పడిపోయి మరణించెను. ఎంత బలవంతుడైనను అనేకులను విరోధులుగచేసి కొనగూడదు.

---

## 89. ఒక రజకుడు వాని గాడిద.

ఒక గ్రామములో ఒక చాకలి ఉండెను. వానికి ఒక గాడిద కలదు. అది ముసలిదై లేచుటకు బలములేనిది అయ్యెను. అప్పుడు ఆరజకుడు దానిమీద పులితోలుకప్పి, దానిని ప్రక్కనున్న పొలములోనికి విడిచి పెట్టెను. ఆగాడిద ఇష్టము వచ్చినట్లు మేయుచుండగా, ఆపొలము కాపరి దానిరీతిని పరీక్షించి, అది పులి అగునోకాదో అను అనుమానము కలిగి, తన గార్ధభమును పొలములోనికి పంపెను. అప్పుడు వ్యాఘ్రచర్మము ధరించిన గాడిద క్రొత్త గాడిదను చూడగానే ఓండ్రపెట్టుచు, దీనియొద్దకు వచ్చిచేరెను. పొలముకాపరి తన దుడ్డుకర్రతో పులిచర్మము గల గాడిదను మోదెను.

---

## 90. ఒక పురోహితుడు పెండ్లికొడుకు.

ఒక పురోహితుడు ఒక పెండ్లికొమారుని చూపులకయి పొరుగూరు పిలుచుకొని పోయెను. పెండ్లివారు నిన్ను ఏమైన అడిగినయెడల తిన్ననిమాటలను, మృదువైన మాటలను మాత్రమే ఆడుమని త్రోవలో బోధించెను. పెండ్లివారి యింటికి బోగానే, పెండ్లికూతురుతండ్రి పెండ్లికొడుకును చూచి 'నీవు ఏమి చదువుచున్నావు?' అని అడిగెను. అందుకు బాలుడు

'కదురుకాడు, కదురుకోల' అనెను. 'నీవయస్సెంత?' అని రెండవప్రశ్న వేసెను. అందుకు పెండ్లికొడుకు 'దూది, వెన్న, దున్నపోతునాలుక' అని చెప్పెను. ఇంతతో పెండ్లికొమారుని తెలివికి అందరును సంతసించి, పెండ్లికొడుకును పురోహితునితోగూడ పంపివేసిరి.

---

## 91. ఒక పులి, ఒక వాయసము.

ఒక వ్యాఘ్రము ఒక అరణ్యములోని మృగములను తినుచు జీవించుచుండెను. ఒకనాడు అది ఒక ఎనుపోతును భక్షించు సమయమున ఒక ఎముక దానికంఠములో ఇఱుకుకొనెను. అప్పుడు అది బాధచే మూలుగుచు ఒకకాకిని చూచి 'ఓకాకమా! ఈఅస్థివలన నేను చనిపోవుదును. అని తోచుచున్నది. దీనిని తీసివేసిన ఎడల నీవు కోరునంత మాంసమును ఇచ్చెదను. పుణ్యము కట్టుకొనుము' అని బ్రతిమాలెను. వాయసమునకు జాలిపుట్టి తన చంచువును వ్యాఘ్రమునోటిలో పెట్టి అడ్డముగ ఉన్న ఎముకను తీసివేసి, వాగ్దానము చేసిన మాంసమును ఇమ్మని కోరెను. అప్పుడు ఆపులి 'ఓహో! ఇది బహు బాగున్నది. నానోటిలో నీవు తలదూర్చి నపుడు నిన్ను కొరికివేయక విడిచి పెట్టినది చాలదా? ఇంకను మాంసము కావలెనా? ఇచ్చటనుండి పొమ్మ' అని మందలించెను.

---

## 92. ఒక బాటసారి—అతని కోతియు, మేకయు.

ఒక బాటసారి పెరుగు అన్నము మూట కట్టుకొని, అతని మేకను, కోతిని కూడతీసికొని, బయలుదేరెను. కొంత దూరము పోవునప్పటికి ప్రొద్దు ఎక్కినందున ఒక చెఱువుసమీపమునను న్న చెట్టునకు తనకోతిని, మేకను కట్టివేసి, అన్నపు మూటను విప్పి, చెఱువులో కాలుసేతులు కడుగుకొనుటకు వెడలెను. అతడు తిరిగి వచ్చులోపల పెరుగు అన్నమును వానరము తినివేసి, తనచేతికి అంటుకొనిన పెరుగును మేకపోతునకు పూసి, ఏమియు తెలియనట్లు నిలుచుండెను. అతడు మేక మోమును చూచి, తాను తెచ్చిన ఆహారమును అజము తినివేసినదని తలచి, దానిని చేతి కఱ్ఱతో బాదెను. వివేక హీనులైనవారు న్యాయాన్యాయములను విచారింపరు అను విషయము మనకు ఈకథవలన విశద మగు చున్నది.

---

## 93. ఒక నవాబు, రామాయణము.

హిందువులు రామాయణమును స్తుతించు చుండగా విని, ఒకనవాబుగారు ఒకపండితుని పిలిపించి, తన్ను రామునిగ తలచి తనరామాయణమును ఆఱునెలలలో వ్రాయుమని సెలవిచ్చెను. గడువునకు రెండుమూడుదినములుండగా, నవా

బుగారు పండితుని పిలచి, రామాయణము ముగిసినదా అని అడిగెను. అప్పుడు పండితుడు, 'నవాబు సాహేబుగారూ! నాకు ఒకచిన్నసందేహము కలదు. రాముని భార్యను రావణుడు దొంగిలించుకొని పోయినట్లు రామాయణములో వ్రాయబడి యున్నది. ఏలినవారి ప్రియురాలిని ఎవరు దొంగిలించుకొని పోయినట్లు వ్రాయవలెనో తెలుప గోరెద' అనెను. అప్పుడు నవాబుగారికి కోపము వచ్చి 'అరే మాకీ రామాయణము వద్దు, ఇంతవరకు వ్రాసింది చింపివేయ్' అని పలికెను.

---

## 94 ఒక రాజు, అతని దుష్ట పుత్రుడు.

ఒక రాజునకు ఒకడే పుత్రుడు. ఆపిల్లవాడు చాలా దుర్మార్గుడు. పండితులను వెక్కిరించును. దరిద్రులను బాధించును. కనబడిన వారిని తిట్టును. ఒకనాడు రాజు తన సుతుని పిలిచి అతనిని తొడమీద కూర్చుండ బెట్టుకొని, ఇట్లు బోధించెను. 'నీవు విద్వాంసులు మొదలగు వారిని తిట్టుటవలన చాల పాపము సంభవించును. నీతిట్లవలన వారికి ఏవిధమైన లోపము కలుగదు. నేను నీకొక దృష్టాంతము చెప్పెదను. ఆకాశమునందు మధ్యాహ్నపు సూర్యునిచూచి ఎవరుగాని నోటినిండుగ నీరుపోసికొని సూర్యునిమీద ఉమ్మివేసినచో ఆనీరు తిరిగి అతని ముఖముమీదనే పడును కాని సూర్యునికి ఏవిధమైన లో

టుచాడు.' ఆ బాలుడు ఈదృష్టాంతమును చక్కగ గ్రహించి ఆదినమునుండి దౌర్జన్యమును మాని కీర్తిని పొందెను.

---

## 95. సంసారము, శాంతము.

ఒక ధనవంతుడు ఒకనాడు ఒక గృహస్థుని యింటిలో ఉండ వలసి వచ్చెను. ఆఇంటిలో వృద్ధులగు భార్యాభర్తలు నలుగురు కొడుకులును, కోడండ్రును, మనుమలును, మనుమరాండ్రును, సేవకులును అందరును చేరి ముప్పదిమంది ఉండిరి. వారు అందఱును స్నేహభావముతో వారివారి పనులను సరిచేయుచుండిరి. వారి అన్యోన్యతకు మెచ్చి ధనవంతుడు ఇంటియజమానుని చేర బిలిచి ఏఉపాయమువలన సంసారమును నడిపించుచున్నది తెలుప వలసినదని కోరెను. ఆవృద్ధుడు కాగితమును తీసికొని దానిమీద శాంతము, శాంతము, శాంతము అని వ్రాసి ధనికునకు చూపెను.

---

## 96. ఒక మాంత్రికుడు, దర్జి.

ఒకనాడు ఒకదర్జి తన స్నేహితుడైన మాంత్రికుని చూచి 'నేను ఎంతదురదృష్టవంతుడను. జనులు చొక్కాలు ధరించుట మానినయెడల నేను కస్తుపడి యుండవలెను' అని

పలికెను. అందుకు మాంత్రికుడు 'ఔను పాపము! నిన్ను చూచిన నాకు కనికరము పుట్టుచున్నది. నీకు కష్టకాలము వచ్చినపుడు నన్ను ఆశ్రియించుము.' అని బదులు చెప్పెను. కొన్ని దినములలో కఱవు వచ్చెను. మాంత్రికుని మాయలను చూచువారు లేరైరి. సూదులను మ్రింగుదు ననియు, నిప్పును క్రక్కుదుననియు చెప్పినను ఎవరును ఒక గవ్వకూడ ఇయ్యరైరి. కాబట్టి అతడు తనసఖునియొద్దకుపోయి ఇదివరలో తాను చెప్పిన తప్పుమాటలను క్షమింపుమని వేడి అతనిని ఆశ్రియించి కఱవు కాలము గడిపెను.

---

# 97. పాటు పడుట.

ఒక గ్రామమునందు ఒక వృద్ధుడు ఉండెను. అతనికి నలుగురు పుత్రులు. వారికి బద్ధకము హెచ్చు. పాటుపడుట వలన గలుగు లాభములనుగుఱించి తండ్రి అనేకసార్లు బోధించెను గాని అవివారి మనస్సున ప్రవేశించలేదు. తండ్రి తన మరణకాలమునందు తన పుత్రులను పిలిచి 'నాకు కాలముసమీపించినది. నాపొలములను అన్నిటిని మీవశపరచితిని. మీరు వానిని ఇతరులకు ఇయ్యకూడదు. ఏలననగా వానిలో ఒకచోట నారొక్కమును పూడ్చిపెట్టితిని' అని చెప్పెను. తండ్రి చనిపోయిన కొన్ని దినములకు పొలములోని రొక్కమును గ్రహిం

చుటకు నలుగురును రాత్రింబవళ్ళు త్రవ్విచూచిరి. గాని రొక్కపుమూట కనబడలేదు. కాని పొలములను త్రవ్వుటవలన పంటలు బాగుగపండి వానికి ఎక్కువ ధరవచ్చుటచే, వారు నలుగురును ధనికులైరి.

---

## 98. ఇద్దఱు చిత్రకారులు.

ఇద్దఱు చిత్రకారులకు తమలో ఎవడు చక్కని చిత్రమును వ్రాయగలడు అను వివాదము ఏర్పడి, వారు రెండుచిత్రములనువ్రాసి, ఒకమధ్యవర్తిని చూడుమని కోరిరి. మొదటివాడు ఒక ద్రాక్షగుత్తిని వ్రాసి, దానికి రంగుపూసెను. అది నిజమైన ద్రాక్షగుత్తి అని తలచి పక్షులు దానిమీద వ్రాలెను. ఇదిచూచి, మధ్యవర్తి మిగుల మెచ్చుకొనెను. రెండవవానిని తన చిత్తరువును చూపుమని మధ్యవర్తి, అడుగగా, అతడు ఎదుటనుండిన తెఱనుచూపి, దానిని పైకెత్తుమనెను. మధ్యవర్తి, తెఱసమీపమునకు పోయి, తెఱను ఎత్తుటకు దానిని చుట్టబోగా, తెఱయొక్కపటము గోడమీద వ్రాయబడియుండుట కనుగొని, అధికాశ్చర్యమును పొందెను. అప్పుడు మొదటి చిత్రకారుడు రెండవవానితో, 'నాచిత్తరువు పక్షులను భ్రమింప జేసినది. నీచిత్తరువో మనుష్యులను భ్రమింప జేసినది.

కనుక నీవు వ్రాసిన చిత్రము నాదానికంటె శ్లాఘ్యమైనది.' అని ఒప్పుకొనెను.



## 99. సేవకులు, తోలుసంచులు.

ఒకవర్తకుడు తనబట్టలను కొన్నితోలుసంచులలో నుంచి, ఒక ఒంటిమీద వానిని వేసికొని, తనసేవకులతో వేఱు గ్రామమునకు బయలుదేరెను. ఎక్కువబరువుచే ఉష్ట్రము కదలలేకపోయెను. అప్పుడు ఆవర్తకుడు తననౌకరులతో, 'మరియొక ఉష్ట్రమును తెచ్చెదను. ఇంతలో వానవచ్చునెడల సంచులు తడవకుండచూడవలసినది' అని చెప్పిపోయెను. కొన్ని నిమిషములలో విపరీతమగు వర్షము కురిసెను. ఆసేవకులకు ఏమియు తోచక, సంచులనువిప్పి, వానిలోని బట్టలను సంచుల మీదకప్పి, సంచులు నీటిచే తడవకుండచేసిరి. కొంతసేపటికి వారి యజమానుడు తిరిగి వచ్చి, సేవకుల బుద్ధిలేమికి ఆశ్చర్యపడెను.



## 100. ఒక ఋషి, అతని కుక్క.

ఒక అడవిలో ఒకఋషి తపస్సు చేయుచుండెను. అతనికి జంతువులయెడ చాలప్రీతి, అతని దగ్గఱ ఒకశునకము ఉండెను. ఒకదినము ఒకచిఱుతపులి ఆకుక్కను మ్రింగజూచెను.

అప్పుడు ఆఋషి తన మహిమవలన ఆకుక్కను చిఱుత పులిగ మార్చెను. ఇంకొకదినమున ఆచిఱుతపులిని ఒకపెద్ద పులి బెదరింపగా, దానిని ఆఋషి వ్యాఘ్రముగ మార్చెను. ఇటులనే మఱియొకనాడు దానిని మదపుటేనుగుగ మార్చెను. కొన్ని దినములైనమీద ఈమత్తేభమును ఒక సింహము చంపచూడగా దానిని సింగముగ మార్చెను. అప్పుడు ఆమృగరాజు పోతరించి, 'ఈముసలిని మ్రింగివేసితినేని, నేనునిర్భయముగ తిరుగగలను. అప్పుడు నారూపమును మార్పగలవాడు ఎవడును ఉండడు!' అని తలచి, ఋషిపైబడె ను. దాని ఉద్దేశమును ఆముని ముందుగా తెలిసికొని, పూ ర్వరూపమును పొందునట్లు దానిని శపించెను. ఆకుక్కరము తన తెలివితక్కువకు వగచుచు కొన్నిదినములలో కాల ధర్మము నొందెను.

---

# 101 నా కథ.

స్నేహితులారా! నాపేరు మూషకుడు నాధనమంత యు ఒక మూషకమువలన వచ్చినది. నాకథ వినుడు.

నాతల్లితండ్రులు నాచిన్నతనమునందు చనిపోయిరి. నాకు జీవనోపాధిలేక మాగ్రామములోని సాహుకారును సమీ పించి, కొంతసొమ్మును బదులు ఇమ్మని వేడితిని. అప్పుడు అ తడు నామీద కోపపడి, ఎదుటను చచ్చిపడియున్న ఎలుక

పిల్లను చూపి తెలివిగలవాడు దానితో సొమ్మును గడించును. అనెను. ఆ చచ్చిన ఎలుకను నేను చంకను పెట్టుకొని, 'దాని విలువ ఇయ్యగలవాడను' అని సాహుకారునకు ఒక కాగితము వ్రాసి, ఇంటికి బయలుదేరితిని. ఒకడు నన్ను త్రోవలో చూచి, తన పిల్లికి ఆహారముగ నా ఎలుకను ఇమ్మని నాకు కొంచెము సెనగపప్పును పెట్టెను. ఆ పప్పును, కడవెడు మంచి నీళ్ళను ఒక చోట ఉంచుకొని, వానిని దారినిపోవుచుండిన కట్టెలమ్మువారికి పంచిపెట్టితిని. వారిలో ప్రతివాడును, నాకు కొన్ని కట్టెలను ఇచ్చెను. వీనిని పోగుచేయగా ఒక మోపు ఆయెను. వీనిని లాభమునకు అమ్మి ఒక చిన్న అంగడిని పెట్టితిని ఈలాగున నా వ్యాపారము వృద్ధియై చాలాధనము సంపాదించితిని. బంగారుతో ఒక ఎలుకను చేయించి, దానిని సాహుకారునకు పంపి, నా ఋణము తీర్చితిని. ఇప్పుడు నాయంత ధనికుడు నా గ్రామములో లేడు. నేను బంగారు మేడలో నివసించుచున్నాను. మీరు మాయింటికి ఒక్కసారి వచ్చి, మా గృహమును పావనము చేయవలెనని ప్రార్థించు చున్నాను.

ఇట్లు

మీ మిత్రుడు

మూషకుడు.

# 102. ఒక బుద్ధిమంతుడగు రయితు.

ఒకానొకప్పుడు ఒక బుద్ధిశాలియగు రయితు తన ప్లీడరుగారి దగ్గరకు పోయి, ప్లీడరుగారూ, ఒక సంగతి జరిగినది. చెప్పుటకు నోరాడకున్న దనెను. ఆ సంగతి తెలుపవలసినదని న్యాయవాది కోరెను. అప్పుడు ఆరయితు 'అది ఒక అసహ్యమైన సంగతి. అట్లు జరుగునని నాకు తెలియదు.' అని పలికెను. ఆవిషయము ఏదో శీఘ్రముగా తెలుపవలసినదని న్యాయవాది బ్రతిమాలగా, ఆ వ్యవసాయదారుడు 'చెప్పుటకు నాకు దుఃఖముగా నున్నది. అది ఏది అనగా, నిన్నటి రాత్రి నాయెద్దు మీయావును కుమ్మినది. పాపము! మీయావు మృతినొందినది. నేను ఏమి చేయవలెను అని అడుగవచ్చితిని' అనెను. అందుకా న్యాయవాది, 'నీవు ఎక్కువ తెలివిగలవాడవు. న్యాయప్రవర్తన గలవాడవని నీకు ప్రఖ్యాతి కలదు. నీయొద్దనున్న ఆవులలో ఒకదానిని ఇచ్చివేయుము. అంతే చాలును.' అని చెప్పెను. అప్పుడు ఆరయితు మీరు చెప్పినది బాగున్నది. కాని 'నేనొక తప్పుచేసితిని. నాయెద్దు మీగోవును కుమ్మినది.' అని చెప్పితిని. అది పొరపాటు. జరిగినది ఏమనగా మీయెద్దునాయావునుపొడిచినది. అందువలన నాయావు ఆయువు తీరిచచనిపోయినది. మీరుచెప్పినధర్మసూత్రమును ప్రకారము నాకుమీరు ఒకగోవును ఇచ్చినయెడల చాలును. అనెను

ఈమాటలువినినతోడనే న్యాయవాది నిశ్చేష్టితుడు అయ్యెను. కొంతసేపు అయినతర్వాత, తలగోకుకొని, 'ఓహో! అటులనా నేనుచక్కగా ఆలోచించి, ఎవరిపొరపాటువలన ఆవుమృతి నొందినదో నిశ్చయించి, కుమ్మినచోటును పరీక్షించి......' అని పలుకుచుండగా, రయితు, 'ఏమండీ ప్లీడరుగారూ! మీ సొమ్ము మీకు న్యాయముగా రావలెనని మీరు కోరునపుడు ఇతరులుకూడ వారి సొమ్ము న్యాయముగ వారికి రావలెనని కోరుట అధర్మమా?' అని ప్రశ్నించుచు వెడలిపోయెను.

---

## 103. కొంచెము కొంచెము.

ఒకనాడు ఒక బాలుడు ఒకయింటినికట్టుచుండగా చూచుచు నిలుచుండెను. వానితండ్రి వానిని చూచి, 'నీవుతాపీపనివాడుకావలెనని కోరుచున్నావా?' అని అడిగెను. అందుకు బాలుడు ఒకచిన్న ఇటికమీద ఇంకొకచిన్న ఇటికవంతున వరుసగాపెట్టుటవలన ఇల్లు, ఏర్పడువిధమును గ్రహించుచు నిలుచున్నాను' అనెను; అందులకు తండ్రి, పుత్రుడా! నీవు చక్కగ గ్రహించితివి. ఈసంగతిని ఎప్పుడును మఱువవద్దు. ప్రతిదినము ఒకపాఠము వంతున చదివినయెడల కొంతకాలమునకు నీవు విద్యావంతుడవు అగుదువు. ఒకఅడుగుతర్వాత మఱియొకఅడుగును వేయుచునడచినయెడల,కొంతకాలమునకు

ప్రపంచమును చుట్టిరాగలము. ఇటులనే నిమిషములు చేరి జీవితకాలము అగును, నీటిబిందువులు చేరి సముద్రము అగును. గాబట్టి మనము ఏదైనకార్యమును చేయవలసినయెడల దానిని తలచుకొని భయపడక కొంచెము కొంచెముగా కష్టపడి పనిచేసినచో ఆకార్యమును సులభముగ నిర్వహింపగలుగుదుము.' అని నొక్కిచెప్పెను.

---

## 104. ఒకన్యాయవాది, అతని కక్షిదారుడు.

ఉత్తరదేశములో ఉండు న్యాయవాది ఒకడు తన రూపమును ఒక ఛాయాయంత్రమువలన తీయించుకొనెను. అతడు తన రూపమును తీయించుకొనునప్పుడు దొరలు ధరించు ఉడుపులను వేసికొని, షరాయిలోని జేబులలో చేతులను ఉంచుకొని యుండెను. తనవద్దకు వచ్చినవారందఱకును తనరూపమును చూపి, బాగుండలేదా అని ప్రశ్నించుచుండెను. అందఱును ఆరూపమును మెచ్చుకొనుచుండిరి; ఇట్లుండగా, ఒకనాడు తనకక్షిదారుడు ఒకడు న్యాయవాదివద్దకు వచ్చెను. అభ్యాసము ప్రకారము న్యాయవాది తనకక్షిదారునికి తనరూపమును చూపి, ఎట్లున్నది అని అడిగెను. దానిలో దోషమున్నట్లు అతడుజవాబు చెప్పగా దోషమున్నచోటు

ను చూపుమని న్యాయవాదికోరెను. అప్పుడు కక్షిదారుడు, 'తమచేతులు ఎచ్చటఉన్నవి?' అని న్యాయవాదిని అడిగెను. 'నామరాయిజేబులలో ఉన్నవి. నీకుకనబడలేదా?' అని న్యాయవాది బదులుచెప్పెను. అందుకు కక్షిదారుడు, దోషము న్నది ఇచ్చటనే. నాకు తముతోచాల అనుభవము కలదు. మీచేతులు ఎప్పుడును ఇతరుల జేబులలో ఉండును గాని తమ జేబులలో ఎప్పుడును ఉండవు' అని చెప్పుచు పోయెను.

— —

## 105. ఒక పుచ్చకాయ.

ఒక గ్రామములోని ధనవంతుడు ఒక సమయమునందు బెజవాడ నగరమునకు వెళ్లెను. అతడు ఒక దుకాణమునందు కొన్ని పుచ్చకాయలను చూచి అవి గుఱ్ఱపుగుడ్లో, లేక ఏనుగుగుడ్లో అని తలచి వర్తకుని 'ఈగుడ్లు గుఱ్ఱపుగ్రుడ్లా?' అని ప్రశ్నించెను. అడిగినవాని వైఖరిచూచి వాని తెలివి లేమిని గ్రహించి 'అవును ఇవిగుఱ్ఱపుగ్రుడ్లే!' అనెను. ఒక్కొక్క దాని వెల ఎంత అని గ్రామస్థుకు అడుగగా నూఱు రూపాయలు అని అంగడివాడు తెలిపెను. ఆపల్లెటూరి వాడు నూఱు రూపాయలనిచ్చి ఒక గుఱ్ఱపు గుడ్డునుకొని 'దీనిని ఇంటికి తీసుకొనిపోయి వెచ్చని చోటున ఉంచినయెడల ఒక గుఱ్ఱపు పిల్లవెలువడును. అది పద్దది అగుట తోడనే దానినెక్కి మా

యత్తగారింటికి పోయెదను. అప్పుడు నా యత్తమామలు నన్ను ఎంతమన్నింతురో!' అని తలచుచు త్రోవలో ఉన్న ఒక పొదలో ఆగుడ్డును ఉంచి సమీపమునఉన్న చెఱువులో నీరు త్రాగుటకు వెడలెను. ఇంతలో ఆపొదనుండి ఒక కుందేలు వెలువడి పరుగెత్తి పోయెను. దానిని గుఱ్ఱపుపిల్ల అని తలచి తనకు కలిగిన నష్టమునకు చింతించుచు ఇంటికివెళ్ళి జరిగిన సంగతి భార్యతో చెప్పెను. గుడ్డుఉంచిన చోటును చూపుమని వచ్చిచూడగా పెట్టిన పుచ్చకాయ పెట్టినట్లే ఉండెను. అప్పుడు భార్య భర్తనుచూచి 'ఇది పుచ్చకాయ కాని గుఱ్ఱపు గుడ్డుకాదు. నిన్ను మోసపెట్టి అంగడివాడు నూఱురూపాయలు అపహరించెను. ఈగుడ్డులోని గుఱ్ఱపు పిల్లలను చూడుము' అని పలుకుచు నేలమీద వేసికొట్టగా పుచ్చకాయ పగిలి దానిలోని గింజలు అన్నియు బయలు పడెను. అప్పుడు ఆపల్లెటూరివాడు తన బుద్ధిహీనతకు చింతించుచు తన భార్య యొక్క తెలివికి సంతసించెను.

---

## 106. ముగ్గురు అన్నదమ్ములు.

ఒక గ్రామములో ముగ్గురు అన్నదమ్ము లుండిరి. వారిలో జ్యేష్ఠుడు తన తమ్ములనుచూచి 'ఈదినమున నేను

ఒక పాడి ఆవును కొనబోవుచున్నాను' అని చెప్పి ప్రక్క గ్రామములోనున్న ఒక రయితు వద్ద ఒక ఆవును కొని తెచ్చెను.

ఈ సంగతివిని రెండవవాడు అన్న యింటికివచ్చి ఆవునుచూచి మిక్కిలి సంతోషించి 'అన్నతో నీవు కొన్న ఆవులో నన్నుకూడ ఒక భాగస్థునిగా ఉండనిమ్ము' అనెను. అందుకు అన్న 'నేను ఆవుకొరకు ఇరువదినాలుగు రూపాయలను ఇచ్చితిని. నీవుకూడ అంత సొమ్ము ఆ యావును అమ్మినవానికి ఇచ్చినయెడల నీవు భాగస్థుడవు అగుదువు' అని పలికెను. వాడు అన్న చెప్పినట్లు చేసెను.

మఱుచటి దినమున కనిష్ట సోదరుడు వచ్చి, తానుకూడ భాగస్థుడుగా ఉండగోరెను. అప్పుడు జ్యేష్ఠుడు వానినికూడ ఇరువదినాలుగు రూపాయలను రయితునకు ఇమ్మనెను. రూపాయలను పుచ్చుకొనునప్పుడు ఆరయితు 'నాపంటపండినది. ఒక బక్క గోవునకు డెబ్బదిరెండు రూపాయలను సంపాదించితిని.' అని మనస్సులో అనుకొని సంతోషముతో ఉబ్బిపోయెను.

ముగ్గురు భాగస్థులును ఒక ఒడంబడిక చేసికొనిరి. అది ఏది అనగా ప్రతివాడును వాని చెంబు తెచ్చుకొని ఒకనాటి పాలను ఆచెంబులో పితికి తీసికొని పోవలసినది. చివరవాని వంతు వచ్చినప్పుడు వానియొద్ద చెంబులేక వానిభాగమైన పాలను నోటితో పిండుకొని త్రాగివేసెను. ఇంటికి పోయి

ఈవిషయము భార్యతో చెప్పఁగా ఆమె మండిపడి, నీతో కా పురము చేయనని చెప్పి, న్యాయస్థానమునకు పోయి మొరపెట్టుకొనెను. న్యాయాధిపతి వ్యాజ్యమును సావకాశముగ విని, కనిష్టునివంతు వచ్చిన రోజున ఉదయపు పాలను భర్త త్రాగునట్లును, సాయంకాలము పాలు భార్యత్రాగునట్లును తీర్మానము చెప్పెను. శ్రోతలు అందరును విని న్యాయాధిపతి యొక్క తీర్మానమును మెచ్చుకొనిరి.



## 107. ఒక కాపువాడు, నదీదేవత.

ఒక గ్రామములో ఒక కాపువాఁడు కట్టెలను కొట్టి, వానిని సరసమైన ధరకు అమ్మి, జీవనము చేయుచుండెను. ఒకనాడు అతడు ఒక నదీసమీపముననుండు వృక్షమును, ఎక్కి కట్టెలను కొట్టుచుండగా, వానిగొడ్డలి నదిలో పడిపోయెను. అప్పుడు వాని ప్రాణములు అలిసిపోయెను. గొడ్డలిని కొనుటకు ఒక కాసు అయినను వానియొద్ద లేదు. తనజీవనము పడిపోయినందులకు చాల దుఃఖించుచుండగా నదిలోనుండి ఒక స్త్రీ ప్రత్యక్షమై, ఒక బంగారు గొడ్డలిని చూపి 'ఇది నీదా?' అని అడిగెను. అందుకు వాఁడు 'నావంటి దౌర్భాగ్యునికి ఇట్టి గొడ్డలి ఉండునా?' అనెను. ఆనదీదేవత నీటిలో ఒకసారి మునిగి ఒక వెండిగొడ్డలిని తెచ్చి చూపి, 'ఇదనీదా ?' అని ప్రశ్నిం

చెను. 'ఇదియు నాదికాదు!' అని కావు జవాబుచెప్పెను. నదీదే వి మరియొకసారి మునిగి, ఒక యినుప గొడ్డలిని తెచ్చి చూపెను. 'ఈగొడ్డలి నాది. మాతండ్రి నా కిచ్చిన ధనము ఇదియే' అని కావు పలికెను. అతని సత్యశీలతకు నదీదేవి సంతసించి, వాని ఇనుపగొడ్డలినేకాక, బంగరు వెండిగొడ్డళ్ళనుకూడ వాని కిచ్చి, అంతర్ధానము అయ్యెను.

ఇంకొక కట్టెలమ్మువాడు ఈసంగతిని విని, ఆచెట్టు మీదకే ఎక్కి, తనగొడ్డలిని జారవిడిచి, ఏడ్చుచు కూర్చుండెను. నదీదేవత ప్రత్యక్షమై ఒక బంగారు గొడ్డలిని తెచ్చి, 'ఇదినీదా?' అని అడిగెను. పేరాసతో, ఇదియే నాగొడ్డలి, అని వాడు బదులు చెప్పగా 'నీవంటివారికి పోయినసొత్తు కూడ రాబోదు' అని పలికి, నదీదేవత నీటిలో మునిగిపోయెను. తన పేరాసకు వగచుచు వాడు ఇంటికి పోయి చేరెను.

---

# 108. బాగ్దాదులోని మంగలి.

బాగ్దాదు నగరములో ఒక మంగలి యుండెను. అతని పేరు రంగడు. అతడు క్షౌరము చేయుటలో చాల నేర్పు కల వాడు. కన్నులు మూసికొని క్షురకర్మ చేయగలడు. ఆనగర ములోని వారందరు అతనినే పిలుచుచుందురు. ఒకనాడు కట్టెల నమ్మువాడు ఒకడు ఒక కట్టెలమోపును తన గాడిద

మీద మోయించుకొని, రంగని యింటికి వచ్చెను. కొయ్యతో చేసిన జీను గాడిదమీదనుండెను. గాడిదమీది సామాను వెల ఏర్పఱచుకొని, వాని విచ్చివేసి, జీనునుకూడ వేయుమని మంగలి కోరగా, కట్టెల నమ్మువాడు సమ్మతింపనందున క్షౌరకుడు ఫిర్యాదు చేసెను. న్యాయాధిపతి మంగలి తరఫున తీర్మానము చేసెను. అప్పుడు ఖరముమీద నుండిన జీనును మంగలికి సమర్పించి, కట్టెల నమ్మువాడు దుఃఖముతో ఇంటికి పోయెను. కాని మంగలిమీద పగ తీర్చుకొనుటకు కొన్ని దినముల తరువాత కట్టెలనమ్మువాడు మంగలి యింటికిపోయి తనకును, తనస్నేహితునికిని క్షౌరము చేయవలసినదని కోరెను. అందులకు మంగలి సమ్మతించి, కట్టెలమ్మువానికి క్షౌరము చేసి, నీస్నేహితుని పిలువ మనెను. అప్పుడు కట్టెలనమ్మువాడు బయట కట్టియుంచిన తన గాడిదెనుచూపి, దానికి క్షౌరము చేయమని మంగలివానితో చెప్పెను. మంగలి ఒప్పనందున, కట్టెలమ్మువాడు ఫిర్యాదుచేసెను. న్యాయాధిపతి మంగలిని చూచి, క్షౌరము చేయుటకు సమ్మతించినమాట నిజమేనా అని అడిగెను. నిజమేకాని గాడిదను ఎవరైనను స్నేహితునిగా భావింతురా? అని మంగలి అడిగెను. అప్పుడు న్యాయాధిపతి, 'జీనుకూడ కట్టెలమోపులో చేరినట్లు భావించున ప్పుడు గాడిదనుకూడ స్నేహితునిగ భావించవచ్చును. కాబట్టి

నీవు తత్క్షణము గాడిదెకు క్షౌరము చేయుము' అని ఆజ్ఞచేసె ను. పాపము! మంగలివాడు న్యాయస్థానమునందు గాడిదకు నబ్బురాసి, క్షురకర్మ చేయవలసినవాడు అయ్యెను.

---

## 109. ఒకసన్యాసి, ఒకబందిపోటుదొంగ

ఒక అడవిలో ఒక సన్యాసి నివసించుచుండెను. అత డు కఱవుకాలమునందు తన ఆశ్రమపు బావిలోని నీటిని అం దఱకును ఇచ్చుచు, రోగులకు ఉపచారము చేయుచు, కీర్తిని సంపాదించెను. ఇతని కీర్తిని ఒక బందిపోటు దొంగ విని, సన్యాసిని సమీపించి, 'అయ్యా! నాయాజ్ఞలను నెఱవేర్చుటకు నన్నూఱు బానిసలు నావద్ద నున్నారు. వీరు కాక నన్ను ఆశ్రయించి నన్నూఱు దొంగలున్నారు; కాసులు, నవరత్నము లును లెక్కలేకయున్నవి. చావులేకుండ నుండవలెననెడి కోరి క ఒకటి నాకు కలదు. దీనిని సంపాదించు మార్గమును మీ వలన నేర్చికొనుటకు వచ్చితిని' అనెను.

అప్పుడు ఆసన్యాసి దొంగను ఒక కొండసమీప మునకు పిలుచుకొనిపోయి, పెద్దబండలను మూటిని చూపి, వానిని మోసికొని కొండమీదికి తనతో రమ్మ నెను. అవి చాల బరువుగనుండుట వలన వీనిని మోయుచు నేను, కదలజాలను, అని దొంగ చెప్పగా సన్యాసి ఒకబండను

పాఱవేయుమని ఆజ్ఞాపించెను. మిగిలిన రెంటిలో దొంగ ఒకబం
డను పాఱవేసి కొంతదూరము నడచెను. పిదప చేతకాక కష్ట
ముగనున్నదని మొఱపెట్టగా రెండవదానిని కూడ పాఱవేయు
మని సన్యాసి చెప్పెను. రెండవదానిని పాఱవేసి కొంతదూర
ము నడచునప్పటికి ఆయాసము అధికమై, 'దానిని మోయుచు
మీతో రాజాలను' అని దొంగపలుకగా, మూడవబండను కూడ
పాఱవేయుమని సన్యాసి చెప్పెను. తరువాత కొంతసేపటికి
ఇరువురును సుఖముగ పర్వతశిఖరము చేరిరి. అచ్చట సన్యా
సి, చోరుని కూర్చుండు మనిచెప్పి ఇట్లు పలికెను. 'పుత్రకా!
నీకుశాశ్వత జీవితము దొరకుటకు మూడుప్రతిబంధకములు
ఉన్నవి. వానిని మొదట తొలగించుము. అట్లుచేసితివేని
రాలను పాఱవేసినపిదప అశ్రమముగా కొండనెక్కగలిగినట్లు
మనాయాసముగా గమ్యస్థానమును చేరగలవు. నీదగ్గఱనుండు
మున్నాఱు దొంగలను తఱిమివేయుట మొదటిపని. రెండ
వపని ఏదిఅనగా నీబానిసలకు స్వేచ్ఛను ఇమ్ము. పిమ్మట నీ
యొద్దనుండు ధనమునంతను సొంతగాండ్రకు ఇచ్చివేయుము.
అట్లుచేయుటకు బందిపోటుదొంగ ఒప్పుకొని సన్యాసియొద్ద సె
లవు కైకొనిపోయెను.

---

# 110. పరమానందస్వామి, ఏఱు.

ఒకనాటి సాయంకాలమునకు పరమానందస్వామి తన శిష్యులతో ఒక నదీతీరమునకు చేరెను. ఆనది అనేకులను మ్రింగివేసినది. కనుక మేల్కొని ఉన్నప్పుడు దానిని దాటుటకు జనులకు భయము. కాబట్టి స్వామివారు ఒక శిష్యునిపంపి నది నిద్రపోవుచున్నదో కనుగొని రమ్మని ఆజ్ఞాపించెను. ఆ శిష్యుడు ఒక మండు దివ్వటీని తీసికొని, ఏటికి బారెడు దూరమున కూర్చుండి దానిని నీటిలో ముంచెను. అప్పుడు పొగతో ఒక బుస్సుమను శబ్దము వినబడెను. వాడు భయపడి అరచేతిలో ప్రాణము పెట్టుకొని స్వామివారికి తెలిపెను. కొంతసేపు అయిన పిమ్మట మఱియొక శిష్యుడు కాగడాను వెలిగించుటకు మఱచిపోయి నీటిలో దానిని ముంచగా శబ్దము కానందువలన నది నిద్రపోవు చున్నది. అని నిశ్చయించుకొని వారందరు ఏటిని దాటిరి.

దాటిన పిమ్మట స్వాములవారు 'మనము పదిమందికదా, అందరము చేరితిమో, లేదో లెక్కపెట్టుడు' అని ఉత్తరువు చేసెను. ప్రతి వాడును తన్ను విడిచి లెక్కపెట్టుట వలన తొమ్మండ్రే లెక్కకు వచ్చుచుండిరి. స్వామివారు లెక్కించినను తొమ్మండ్రే వచ్చిరి. ఆపాడునది ఒకరిని పొట్టను పెట్టుకొన్న

ది అని అందఱును దుఃఖించిరి. గాని గతించిన వాడు ఎవడో యిప్పటికిని తెలియలేదు.



## 111. జీర్ణం, జీర్ణం, వాతాపి జీర్ణం.

ఒక గ్రామములో వాతాపి, ఇల్వలుడు అను నిద్దఱు రాక్షసులు ఉండిరి. వారు సోదరులు. వారు చచ్చిబ్రిదుక గల విద్యను నేర్చుకొని యుండిరి. ఎవరయిన వచ్చిన యెడల వారిని వారు గారవించి భోజనమునకు పిలుచు చుండిరి. అపుడు ఇల్వలుడు వాతాపిని చంపి, వాని మాంసమును వండి. వచ్చిన వానికి కడుపునిండ భోజనము పెట్టుచుండెను. భోజనము కాగానే తాంబూలము ఇచ్చుటకు వాతాపీ అని పిలుచుచుండెను. అప్పుడు వాతాపి పొట్టను చీల్చుకొని వచ్చుచుండెను. పిమ్మట వారిద్దఱు చనిపోయిన వాని మాంసమును వండి భుజించు చుండిరి.

ఇట్లుండగా ఒకనాడు అగస్త్యుల వారు వచ్చిరి. వారిని ఈరాక్షసులు భోజనమునకు పిలిచిరి. మామూలు ప్రకారము ఇల్వలుడు అగస్త్యునికి భోజనము పెట్టెను. భోజనము ముగియుటకు మునుపు ఆ మునిపుంగవుడు జీర్ణం, జీర్ణం, వాతాపిజీర్ణం అని పలికివాతాపిని పిలువుమని ఇల్వలునితో చెప్పెను. ఇం

కెక్కడి వాతాపి? వాడు అగస్త్యుల వారి కడుపులో జీర్ణమై పోయెను.

ఇందు వలననే హిందూస్త్రీలు బిడ్డలకు పాలుపోసి జీర్ణం, జీర్ణం, వాతాపి జీర్ణం, అనుట కలదు.

---

## 112. విక్రమార్కుని సాహసము.

ఒకనాడు విక్రమార్కుడు సభలో ఉండగా, కొందరు వేగులవాండ్రు వచ్చి, ఇట్లు చెప్పిరి. కాశ్మీర దేశములో ఒకధనవంతుడు జనుల నీటి యిబ్బంది పోగొట్టుటకు, ఒకగొప్పచెరువు త్రవ్వించెను. చెరువులో జెలపడ నందుకు విచారించుచుండగా సుగుణవంతుడగు పురుషుడు తనరక్తముతో చెఱువును దడిపిన నొడల జెలపడును అని ఆకాశవాణి పలికెను. అప్పుడు ఆ ధనికుడు తన కంఠములోని నెత్తురుతో చెఱువును తడుపువానికి నూఱు బారువుల బంగారమును ఇచ్చెదను అని చాటించియున్నాడు, ఇంతవరకు ఎవడును రాలేదు. ఈపలుకులు వినగానే విక్రమార్కుడు మాఱు వేషము వేసికొని, ఆచెఱువుకుపోయి, కత్తితో తన కంఠమును పొడుచుకొనబోయెను. తోడనే నారాయణుడు ప్రత్యక్షమై చెఱువునిండినట్లు చేసెను. నూఱు బారువుల బంగారును తెచ్చి ఆధనికుడు విక్రమా

ర్యాని కియ్యగా వానిని అతడు ఒకబ్రహ్మచారికి ఇచ్చి, పెండ్లి యాడి సుఖంబున నుండుమని చెప్పి, తన రాజ్యమునకు వచ్చి చేరెను.



# 113. నల్లకుక్కను తెల్లకుక్క చేయుట.

ఒకదినమున రాయలువారు ఆలస్యముగ లేచిరి. ఆరోజు వారుక్షౌరమునకు ఏర్పాటుచేసికొనిన రోజుకనుక మంగలి రాయలువారిని లేపక యే క్షురకర్మచేసి పోయెను. నిద్రనుండి లేచినపిమ్మట రాయలువారు మంగలిని పిలిచి, నీకువమికావలెనో తెలుపుము అనిరి. అతడు బ్రాహ్మణుడు కాగోరెను. అప్పుడు రాయలు పండితులందఱను రప్పించి, అనుమానములలో మంగలిని బ్రాహ్మణునిచేసి, వానితో బ్రాహ్మణులందఱు కూర్చుండి భుజింపవలసినది అని ఆజ్ఞాపించెను. బ్రాహ్మణులకు ఏమియుతోచక తెనాలిరాముని సాహాయ్యమునుకోరిరి. మఱు వుదినము తీఱురోజున తెనాలిరాముడు ఒకనల్లకుక్కను తెచ్చి, దానిమెడకు త్రాడుకట్టి, దానిని నీటిలోముంచుచు, అగ్నిచుట్టు త్రిప్పుచు, తిరిగి నీటిలోముంచుచు, అగ్నిచుట్టు త్రిప్పుచుండెను. బాధపడలేక కుక్క మొఱుగుచుండెను. రాయలు తెనాలిరాముని చూచి, 'నీవు పిచ్చివానివలె ప్రవర్తించుచున్నావు. నల్లకుక్క తెల్లకుక్క అగునా.' అని అడిగెను.

అప్పుడు తెనాలిరాముడు 'స్వామీ! మంగలివాడు బ్రాహ్మణుడు అగునప్పుడు నల్లకుక్క తెల్లకుక్క కాకూడదా?' అనెను. రాయలు సిగ్గుపడి తలవంచుకొనెను.

---

## 114. ఎద్దుపాలు.

ఒకనాడు అక్బరుపాదుషా తన మంత్రినిపిలిచి, ఒకవారములో తనకు ఎద్దుపాలను సంపాదించి పెట్టుమని చెప్పెను. మంత్రితనయింటికి వెళ్లి, ఏమియుతోచక దిగులుపడి ఉండెను. అతనిభార్య అతనివిచారకారణమును కనుగొని, అతడు ఒకవారము యింటి నుండి వెలుపలకుపోనియెడల ఎద్దుపాల విషయము కనుగొనెదను అనిచెప్పెను. మంత్రి అందుకు సమ్మతించెను. నియమితమైనరోజున మంత్రియొక్క భార్యమైలబట్టలమూటను మోసికొని, రాజునగరునకు ఎదురుగనుండు చెఱువులో, వానిని ఉదుకుచుండెను. పాదుషా ఆసుందరిని చూచి, ఆమెబట్టలుఉదుకవలసివచ్చిన కారణమును అడిగెను. అందులకు ఆమె 'ధర్మప్రభో, మానౌకరులు మమ్ములను వదలి వెళ్లిపోయిరి. నాభర్త బిడ్డను కనియున్నాడు. కావున 'నేను బట్టలు ఉదుకవలసి వచ్చినది' అనెను. ఏమివింత? 'మగవారు కనుదురా?' అని పాదుషా అడిగెను. అప్పుడు మంత్రిభార్య 'ప్రపంచము అంతయు విపరీతము అగుచున్నది. చక్రవర్తులు తమ మంత్రులనుపిలిచి

ఎద్దు పాలను తెమ్మని కోరునప్పుడు ఇటువంటి పనులు జరుగ కూడదా' అని అడిగెను. బాదుషా సిగ్గుపడి, ఆమె బీర్బల్ అను తనమంత్రి యొక్క భార్య అని గ్రహించి, ఆమెకు బహుమానమును ఇచ్చి పంపివేసెను.



## 115. భోజరాజు, ఇద్దఱు ఛాందసులు.

శ్రుతిస్మృతులను చక్కఁగ చదివిన ఇద్దఱు ఛాందసులు తమ దరిద్రమును వదలించుకొనుటకు ధారానగరము ప్రవేశించిరి. కవిత్వము చెప్పినవారికే చక్కని బహుమానము దొరకునని విని, భువనేశ్వరిని దర్శించి, కవిత్వము ప్రారంభించిరి. మొదటివాడు కష్టపడి 'రాజేంద్రా! అన్నము పెట్టుము' అను పాదమును అల్లెను. రెండవవాడు 'నేయి, పప్పును కలిపిన' అను రెండవపాదమును స్మరించెను. మిగిలిన సగము శ్లోకము పూర్తిచేయలేక, గింజుకొనుచుండగా కాళిదాసు అచ్చటికి వచ్చుట తటస్థించెను. వారి సంగతి కనుగొని 'శరత్కాలపు చంద్రికవలె తెల్లనయిన గేదెపెరుగుతోఁగూడ' అని మిగిలిన సగమును పూర్తిచేసి పోయెను.

మఱునాడు ఛాందసులు ఇద్దఱును భోజరాజు సమీపమునకు వెళ్లిరి. ఇద్దఱును ఒక్కసారి శ్లోకమును చదివిరి. రాజు వారిని చూచి 'మొదటి రెండు పాదములును చెప్పిన

వారు ఎన్నడును కవిత్వము చెప్పి ఎరుగరు. మూడునాలుగు పాదములందు మాత్రము స్వారస్యము కలదు గనుక వారికి లక్షరూపాయలను ఇచ్చి పంపివేసెను. వచ్చిన సొమ్మునకు పరమానందమును పొందుచు ఛాందసులు ఇంటికి పోయిరి.

---

## 116. ఒక రజకుడు, వాని కొడుకు, గాడిద.

ఒక గ్రామములో ఒక బీదరజకుడు వానికొడుకుతో వసించుచుండెను. వారి భోజనము గడవక వారియొద్దనున్న గాడిదను అమ్ముటకు సంతకు తీసికొని పోవుచుండిరి. త్రోవలో వారికి కొందఱు ఎదురుపడి. 'ఈబలిసిన గాడిదను తోలుకొని పోవుట ఆశ్చర్యకరముగ నున్నది. ఈపిల్లవానిని కూర్చుండ బెట్టితోలుకొని పోవలెనని తోచలేదా?' అని ముసలి రజకుని నిందించిరి. వారిమాట యుక్తమని తలచి ఆరజకుడు తన కుమారుని గాడిదమీాద ఎక్కించి తోలుకొని పోవుచుండెను.

కొంతదూరము పోవునప్పటికి మఱికొందఱు కనబడి, 'నీవు వృద్ధుడవు, నీవు గార్దభమును ఎక్కిపోవుటకు బదులు పోతువలె ఉన్న నీకొడుకును గాడిదమీాద కూర్చుండబెట్టితివి. ఏమి తెలివి ఇది!' అని వెక్కిరించిరి. ఆమాటలు విని ఆవృద్ధరజకుడు తాను గార్దభమును ఎక్కి, తన పుత్రుని నడచి రమ్మనెను.

ఇంక కొంచెము పేపటికి మఱికొందఱు అగపడి, "ఓ తెలివిహీనుడా! ఈబలిసియున్న గాడిదె మీయిద్దఱను మోయలేదా? పిల్లవానినిగూడ ఎక్కించుకొనుము.' అని మందలించిరి. తర్వాత ఇద్దరును గాడిదను ఎక్కి పోవుచుండిరి.

ఇంతలో మఱికొందరు కంటబడి, 'మీబరువునకు గాడిద చచ్చిపోవుచున్నది. దాని నడుము చూడుడు. ఇద్దఱును దానిని ఎక్కి పోవుటకంటె దానిని మోసికొనిపోవుట మంచిది' అనిరి. వారి మాటలను నమ్మి, వారు ఇరువురును క్రిందికి దిగి, గాడిదయొక్క నాలుగుకాళ్ళను చేర్చికట్టి,ఒకకఱ్ఱనుదూర్చి తండ్రియు, కొడుకును కఱ్ఱయొక్క చెఱియొకవైపునను భుజము మీద పెట్టుకొని నడచుచు పోవుచుండిరి. సంతచేరుటకు మునుపు ఒక వంతెనమీద పోవలసివచ్చెను. అప్పుడు కొందఱు బాలురు కొందఱు ఈగార్దభమునుచూచి చప్పట్లుకొట్టి నవ్విరి. వారి కేకలకు గాడిద కాళ్ళు తన్నుకొని, త్రాళ్లను త్రెంచుకొని, వంతెనక్రింద నున్న నీటిలోపడి చనిపోయెను. తండ్రియు, కొడుకును కనబడినవా రందఱు చెప్పినట్లు చేయుటవలన గలిగిన నష్టమునకు వగచుచు రజకుడు ఇంటికి మఱలిపోయెను.

---

## 117 ఏనుగులు, నక్కలు.

ఒకానొక సమయమునందు నీటికఱవు సంభవించి, దేశము లోని చెఱువులు,సరస్సులు,గుంటలు మొదలైనవి ఎండిపోయెను.

అచ్చట నుండిన ఏనుగులు సమృద్ధిగ నీరుండు దేశమునకు పోవుచుండగా ఒక అడవి యందు ఒక సరస్సు కనబడెను. దానినిండ జలముండుటచేత ఆయరణ్యములో నివసించి, ఆసరస్సున నీరు త్రాగు నట్లు ఆద్విపములు తీర్మానించు కొనెను. ఏనుగులు త్రోవనునడుమ నప్పుడు వాసి కాళ్ల త్రొక్కుడుచే కొన్నినక్కలు మరణించుట తటస్థించు చుండెను. కావున ఏనుగులు ఆసరస్సునకు రాకుండ చేయుటకు నక్కలు అన్నియు ఒక ఉపాయమును వెదకినవి, వానిలో ఒక ముసలి నక్క ఏనుగులు సరస్సునకు పోవునప్పుడు సమీపమున నున్న చెట్టునెక్కి ఇట్లనెను 'ఓ కుంజరములారా! ఈసరోవరము పేరు చంద్రపుష్కరిణి. దీనిలో చంద్రుడు తన భార్యతో స్నానము చేయుచుండును. మీరు దీనిలో స్నానముచేయకూడదు అని నన్ను చెప్పమనెను. నేను చెప్పినది నిజము కాదని తోచిన పక్షమున మీరు వెళ్లి సరస్సులోని నీటిలో చూడుడు. ఈమాటలు వినగానే, ఆద్విరదములు సరస్సు చెంతకు వెళ్లి నీటిలో చూచినవి. చంద్రుని బింబము ప్రతిఫలించి కదలి నట్లు కూడ కనబడెను. ఆ దంతావళీయములు భయపడుచు, 'ఓ చంద్రుడా! మా అపరాధమును క్షమింపుము. మేము ఇదిగో ఇచ్చటనుండి పోవుచున్నాము' అని పరుగిడి పోయెను. ఉపాయమువలన కార్యసిద్ధి అగును అని మనముగ్రహింపవలెను.

———

# 118. రెండు చిలుకలు.

ఒకనాడు ఒక బ్రాహ్మణుడు నర్మదానదిలో స్నానము చేసి, సమీపముననున్న ఒక చెట్టునీడను చేరెను. అప్పుడు చెట్టుమీదనున్న ఒక రామచిలుక క్రిందివిధమున మాటలాడెను. 'ఇదిగో, మనుష్యుడు వచ్చుచున్నాడు. వానికన్నులను పొడువుండి. మెడను పీకుండి, కాళ్ళను కట్టుండి,' ఈధ్వనులను విని, ఆబ్రాహ్మణుడు అచ్చటనుండుటకు భయపడి, కొంతదూరమున నున్న ఒక మామిడిచెట్టు క్రిందికి పోయెను. అచ్చట అతనికి క్రింది ధ్వనులు వినబడెను. 'అదిగో బ్రాహ్మణుడు ఆయాసపడి వచ్చుచున్నాడు. అతడు కూర్చుండుటకు మెత్తని ఆకులను వఱువుండి, నెమ్మదిగ కూర్చుండుమని చెప్పుండి, పండిన పండ్లను తినుటకు ఇయ్యుండి, అతనికి ఉపచారము చేయుండి.' ఈమాటలను విని ఆబ్రాహ్మణుడు చాల సంతోషము పొంది.చెట్టుమీదనున్న రామచిలుకను చూచి, 'ఇంతకు మునువు చంపుము, కొట్టుము అను చిలుకను చూచితిని. అది ఎవరు? నీవు ఎవరు?' అని అడిగెను. అప్పుడు ఆచిలుక 'స్వామీ! మేము ఇరువురము అన్నదమ్ములము. నేను ఒక బ్రాహ్మణుని ఇంటిలో పెరిగితిని. ఆచిలుక ఒక కటికవాని ఇంటిలో పెరిగినది. వాడు మేకలను, గొఱ్ఱెలను చంపుచు జీవించుచుండెను. కనుక ఈ నీచపుమాటలు దానికి అభ్యాసమైనవి.' అని చెప్పెను. సన్మార్గుల సహవాస

ము సద్బుద్ధిని, దుర్మార్గుల సహవాసము దుర్బుద్ధిని కలిగించు నని ఈకథ స్పష్టపఱచుచున్నది.

---

## 119. గొంతెమ్మ కోరికలు.

ఒక ధనికుఁడు అమావాస్యరోజున ఒక బ్రాహ్మణున కు భోజనము పెట్టి, రాత్రి ఫలహారమునకు పేలపిండిని ఇచ్చె ను. అతడు కడుపార తినియుండుటవలన తనగ్రామమునకు పో లేక ఒక చెట్టుక్రింద పండుకొని, ఇట్లు తలచెను. 'నేను ఈపేల పిండిని అమ్మినయెడల అర్ధరూపాయ వచ్చును. దానితో ఒక మేకను కొనెదను. అది ఆఱునెలలో పిల్లలను పెట్టును. కొంత కాలములో కావలసినన్ని మేకలు ఏర్పడును. వానిని అమ్మి ఆవులను కొనెదను. వానివలన కొద్దికాలములో ఒకపశువుల మంద ఏర్పడును. మందలోని పశువుల నమ్మి, వచ్చినసొమ్ముతో వర్తకముచేసి, చాలధనము సంపాదించి, మేడను కట్టుదును. అంత నాకు పెండ్లికి పిల్లలను మేము ఇచ్చెదము, మేము ఇచ్చెదము అని ధనవంతులగు బ్రాహ్మణులు వచ్చెదరు. చక్కని చుక్కను ఒకదానిని నేను పెండ్లియాడుదును. త్వరలో నాకు బంగారుబొమ్మవంటి పుత్రుఁడు కలుగును. వానిని ప్రేమతో చూడనపుడు నాభార్యను నేను కనరి తన్నుదును'

అనుచు కాలు జాడించగా, పేలపిండిముంత కాలికి తగిలి, ముంత పగిలిపోయి పిండి అంతయు మట్టిలో కలిసిపోయెను.



# 120. ఒక ఆదియాంధ్రకన్యక.

అనేకసంవత్సరములు క్రిందట ఒక ఊరిలో ఒక ఆదియాంధ్రకన్యక ఉండెను. ఆపిల్ల చాలా చక్కనిది. ఆ బాలిక ఒక గొప్పవానిని వివాహమాడ గోరి ఒకనాడు వీధిలో పోవుచుండిన ఒక రాజును చూచి, అతనిని వెంబడించెను. కొంత దూరము వెళ్లినపిదప ఒక సన్యాసి రాజునకు ఎదురు పడెను. అప్పుడు ఆ భూపాలుడు గుఱ్ఱమునుండి దిగి సన్యాసికి మ్రొక్కెను. దీనివలన రాజుకంటె సన్యాసి గొప్పవాడని గ్రహించి, సన్యాసిని పెండ్లియాడ దలచి అతనిని వెనుదగిలెను. ఆసన్యాసి ఒక ఆలయము ప్రవేశించి శివ విగ్రహమునకు మ్రొక్కెను. అంతట ఆ విగ్రహమును వివాహమాడ గోరి ఆ కన్యక విగ్రహసమీపమున కూర్చుండి యుండగా ఒక శునకము వచ్చి తన దేహమును విగ్రహమునకు రాచెను. ఇదిచూచి కుక్కను భర్తగాగోరి ఆకన్యక దాని వెంట వెళ్లెను. అది ఒక మాలపల్లెలోనిగుడిసెలో ప్రవేశించి, అచ్చట నుండిన మాల యువకుని పాదములనునాకి తోక యాడించుచు నిలబడెను. అప్పుడు

తన కులము లోనివాఁడే ఎక్కువ గొప్పవాఁడు అని ఆ కన్యక తీర్మానము చేసికొని వానికి భార్యయై, వానితో పెక్కు సంవత్సరములు సుఖముగా జీవించెను.



## 121. తోఁక పీకుడుగాఁడు.

ఒకనాటి రాత్రి ఒక దొంగ ఒకరియింట కన్నము వేసెను. ఇంటివారు మేల్కొని వానిని తఱిమిరి. వాఁడు వడిగా పరుగెత్తుచు, ఏమియు తోఁచక, త్రోవలో ఉండిన పులిమీఁద కూర్చుండి, దానిని కాళ్ళతో తన్నెను. ఆపులి తనమీఁద ఏదో ఎక్కినది అనియు ఆగినయెడల అది చంపివేయును అనియు తలచి ఎక్కువవేగముగా పరుగెత్తెను. ఆ దొంగ త్రోవలోని చెట్టుకొమ్మను, ఒకదానిని పట్టుకొని, దానిమీఁదకెక్కి కూర్చుండెను. వేగముగా పరుగెత్తుపులిని ఒక నక్క చూచి, 'పులి బావగారూ! ఏమి ఈ తొందర?' అని ప్రశ్నించెను. అప్పుడు పులి 'పులిమీఁద పుట్రయందురు. నామీఁద ఒక పుట్ర ఎక్కి ఇంతవఱకు నాప్రాణము తీసివేసినది.' అని చెప్పెను. అందుకు జంబుకము 'నేను పుట్రను పట్టితెచ్చెదను' అని చెప్పి, పులి యొక్క కాలి జాడలవలన చెట్టువద్దకు వచ్చెను. ఆ దొంగ చెట్టునుండి దిగి ఒక పాడుదేవాలయములో ప్రవేశించి తలుపువేసికొని కూర్చుండియుండెను. ఆనక్క చెట్టుమీఁద ఎవరును

లేకుండుటచూచి, పాము దేవాలయము తలుపులోపలి గడియతీయుటకు మీఁదనున్న రంధ్రములో తనతోఁకనుదూర్చెను. లోపలనున్న దొంగ తోఁకను గట్టిగ పట్టుకొని లాగెను. అప్పుడు తోఁక ముక్కలైపోయెను. ఆ పాము ఏడ్చుచు సింహము కడకు పోయి 'స్వామీ, మా మీఁద నెక్కినది పాటి కాదు. తోఁక పీకుడు కాదు' అని విన్నవించెను.

---

## 122. రామకృష్ణుడు, రాజుగారి నౌకరులు.

ఒకనాడు రామకృష్ణునిమీఁద రాజుగారికి కోపమువచ్చి తన నౌకరులలో ఇద్దఱను పిలచి, రామకృష్ణుని ఊరి బయటకు కొనిపోయి, తలనఱకుమని ఉత్తరవుచేసెను. ఊరిబయటకు కొని పోవునపుడు రామకృష్ణుడు ఆసేవకులను ఈ విధముగా బతిమాలెను. 'మీరు నాతలను నఱకుటకుముందు నాకు కొన్ని నిమిషములు దేవుని ధ్యానించవలెనని యున్నది. నేను నీటిలో నిలుచుండి, దేవుని ప్రార్థించిన పిదప, ఊఁ అనెదను. అప్పుడు మీరు ఇద్దఱును మీకత్తులను సిద్ధముగా ఉంచుకొని, చెఱియొక ప్రక్కను నిలుచుండి, నాతలను నఱకివేయుడు' ఇందులకు వారు సమ్మతించిరి. రామకృష్ణుడు దేవుని ధ్యానించినపిదప, ఊఁ అని నీటిలోనికి మునిగెను. ప్రక్కనుండిన సేవకు



రామకృష్ణుడు శిక్షనుండి తప్పించుకొనుట

కథ—122

ల కత్తులు ఒకరికత్తి మఱియొకరి మెడకు తగిలి వారి రెండు శిరస్సులును ఒక్కసారి ఖండింపబడెను. రామకృష్ణుడు నీటినుండి లేచి రాజుగారిని దర్శింప ఏవిధముగ గండము తప్పించుకొంటివని రాజుగారు అడిగిరి. జరిగిన సంగతి కృష్ణునివలనవిని, రాజు సంతోషించి రామకృష్ణుని మన్నించెను.

---

## 123. దొంగను పట్టుకొనుటకు కోమటిచేసిన యుక్తి.

ఒక గ్రామములో ఒక కోమటి తన భార్యతో ఒక యింట కాపురము చేయుచుండెను. ఒకనాటిరాత్రి ఆదంపతులు పండుకొనియుండగా ఒక దొంగ వారింటికి కన్నముత్రవ్వి, కన్నములో కూర్చుండియుండెను. సెట్టి మేలుకొని, అఱచినయెడల దొంగ పైబడునని భయపడి, భార్యను లేపి, తనకొక కలవచ్చినదని చెప్పెను. ఆకలను చెప్పుమని భార్య బ్రతిమాలెను. మన దేవుడు శ్రీవెంకటేశ్వరులు నాకు ప్రత్యక్షమై మనకు ఒక పుత్రుడు పుట్టునని కలలో చెప్పెను. వానికే యేమి పేరు పెట్టుదము అని అడిగెను. మాతండ్రి పేరు పెట్టుమని భార్య కోరెను. మాతండ్రిపేరు పెట్టుదము అని భర్త చెప్పెను. పేరువిషయము ఇద్దఱికిని గొప్ప వివాదము జరిగి, తుద

కు గ్రామతలారి సుబ్బన్న పేరు పెట్టుటకు నిశ్చయించుకొనిరి. అట్లైన, మన పిల్లకు నగలుపెట్టుకొని వీధిలో ఆడుచుండగా ఏమని పిలిచెదవు అని వైశ్యుడు అడిగెను. సుబ్బిగా అని పిలిచెదను అని భార్య పలికెను. అట్లుకాదు, సుబ్బన్నా అని పిలువుము. అని మగడు అనెను. బాలుడు కొంత దూరమున ఉన్నచో ఏమని పిలిచెదవు అని మఱియొక ప్రశ్న వేసెను. అందుకు కోమటమ్మ సుబ్బన్నా అని పెద్దకేక వేసెను. ఆకేకను గస్తీ తిరుగుచున్న తలారి సుబ్బన్న విని, పరుగెత్తుకొని వచ్చి, తలుపుతట్టి, ఎందుకు నన్ను పిలచితిరి అని అడిగెను. కోమటి లేచి, తలుపు తెఱచి, జరిగిన సంభాషణను తెలిపి, దానిలో అసత్యము ఏదైన కలదో కన్నములోని మహానుభావుని అడుగుమని కోరెను. అప్పుడు తలారి సుబ్బన్న ఆకన్నపుదొంగను పట్టుకొని, వానిని తీసికొనిపోయి, కచ్చేరీలో ఒప్పచెప్పెను.

---

## 124. ఇసుక తక్కెడిగాడు, పేడ తక్కెడిగాడు.

రాజమండ్రిలోని నాళమువారి సత్రములో ఒకరాత్రి ఒకడు పరుండియుండెను. అతడు కొంత పేడను మూటకట్టుకొని, ఏబాటసారికైన మోసపుచ్చి, ఏమైన తీసికొనిపోదలచెను. ఇంతలో ఒక మార్గస్థుడు గోదావరియొడ్డున నుండు

గంద్ర ఇసుకను మూటకట్టుకొని పేదతక్కెడిగాని దగ్గఱకు పోయి, 'అయ్యా! నిన్నటినుండి నాకు అన్నము దొరకలేదు ఆకలిచే బాధపడుచున్నాను. నాయొద్ద బియ్యము ఉన్నవి. కాని వంటచేసికొనుటకు తాళజాలను' అని చెప్పెను. పేదతక్కెడిగాడు వానియొద్ద నిజముగ బియ్యపుమూట ఉన్నదని తలచి, ఆబియ్యమును గ్రహింపనెంచి, 'నాయొద్ద కొంచెము అన్నమున్నది. నీవు దానిని తినుము. నేనుకొంత సేపైనపిమ్మట నీబియ్యమును వంటచేసికొనెదను.' అని పలికి, దొరకినది చాలునని తన ఇసుకమూట బదులు పేదమూటను తీసికొని, తన మోసము బయలుపడునని సత్రమునుండి మాయమునకు పోయెను. పేదతక్కెడిగాడుకూడ తనమోసము బయలుపడునని తాను సంపాదించిన మూటతో ఇంకొక సత్రమునకు పోయెను. ఇద్దఱును వారివారి మూటలను విప్పి చూచుకొని 'నాకంటె మోసకాడు ప్రపంచమునందు కలడే!' అని ఇరువురును ఆశ్చర్యపడుచు, ఎవని ఇంటికి వాడు వెళ్ళెను.



## 125. నలుగురు స్నేహితులు.

ఒక గ్రామములో నలుగురు స్నేహితులు ఉండిరి. వారిలో ముగ్గురు శాస్త్రములను చక్కగ చదివినవారు. కఱవు కాలము అగుటవలన జీవనము జరుగక వేఱుదేశమునకు పోవుట

కు నిశ్చయించిరి. శాస్త్రజ్ఞులగు ముగ్గురును ధనార్జనముచేసి నాలుగవ వానికి కొంచెము ద్రవ్యము ఇచ్చునట్లు సమ్మతించిరి. నలుగురును ఒక శుభముహూర్తమున బయలు దేరిరి. వారు ఒక అడవిగుండ పోవునపుడు ఒక సింహాము యొక్క ఎముకలు కనబడెను. తమ శాస్త్రజ్ఞానమును అభ్యాసము లోనికి తెచ్చుటకు ముగ్గురు విద్వాంసులును నిశ్చయించుకొనిరి. ఒకడు ఎముకలను అన్నిటిని క్రమ స్థితిలో పెట్టెను. రెండవవాడు నెత్తురు మాంసము, వీనిని సృజించెను. తృతీయుడు ప్రాణము పోయుటకు మునుపు నాల్గవవాడు 'మీరు ఏమిచేయుచున్నారో ఆలోచింపుడు సామాన్యజ్ఞానము లేని శాస్త్రజ్ఞానము చిల్లిగవ్వకు కూడ పనికిరాదు. ప్రాణము వచ్చుటతోడనే సింహాము మనలను మింగివేయును అని చెప్పెను. వాని మాటలను వినక మూడవవాడు ప్రాణము పోసెను. ఇంతలో నాల్గవవాడు సమీపమున నున్న వృక్షమెక్కెను. మృగరాజు గర్జించుచు దిగువున ఉన్న ముగ్గురుని భక్షించి పోయెను. సామాన్యజ్ఞానము కలవాడు చెట్టునుండి దిగి తన గ్రామమునకు సుఖముగ వెళ్ళెను.

---

## 126. అబ్బాసు

పారశీక దేశమున పూర్వకాలమునందు అబ్బాసు అను రాజు పాలించుచుండెను. అతడు చాల ఔదార్యము కలవా

డు. ఒకనాటి ఉదయమున అతడు వేటకు బయలు దేరెను. ఊరి వెలుపటికి పోవునప్పటికి అతనికి ఒకడు ఎదురుపడెను. వాడు వికారరూపము గలవాడుగ నుండుటవలన రాజు గుఱ్ఱము బెదరి, రాజు క్రిందపడెను. ఈ దుశ్శకునమునకు వగచి, ఎదురుపడినవాని తలను నఱికివేయుము. అని రాజు తన నౌకరులకు ఆజ్ఞచేసెను. రాజుయొక్క సేవకుడు ఒకడు అతనిని పట్టుకొని, చెట్టునకు కట్టి, తల నఱుకుటకు గొడ్డలిని పైకెత్తెను. అప్పుడు అతడు రాజును చూచి 'మహాప్రభూ! నన్ను చంపుటకు మును పు నానేరమును నాకు తెలుపుడు' అనెను. అందుకు రాజు 'నీవికారమైన ముఖమే నీ నేరము' నీముఖమును చూడక పో యిన యెడల నేను గుఱ్ఱమునుండి క్రిందబడియుండను.' అని పలికెను. అప్పుడు అతడు చేతులను జోడించుకొని 'స్వామీ! ఉదయమున మీముఖము చూచుటవలన నాకు మరణదండన కలిగినది,మీరు నన్ను చేసిన నేరమును ఏమనిపిలుతును,అనెను. ఆమాటలకు రాజు చిరునవ్వునవ్వి, అతని నేరమును క్షమించితి నని పలికెను.

---

## 127. జిత్తులమారి మల్లయ్య, కపటములేని కనకయ్య.

జిత్తులమారి మల్లయ్య, కపటములేని కనకయ్య అను నిద్దఱును ఒకగ్రామములో ఇరుగుపొరుగువారుగ నుండిరి. కన

కయ్య గ్రామాంతరము పోవలసివచ్చినందున తనయొద్దనున్న ధనమును ఒక సంచిలోనుంచి, ఆసంచిని మల్లయ్యకును, అతని భార్యకును, ఒప్పగించి, వెళ్ళెను. 'అతడు మనలను రసీదు అడుగక వెళ్ళుట మంచిది.' అని అతని భార్య చెప్పెను.

కొంతకాలము తర్వాత కనకయ్య మఱలివచ్చి తన సొమ్మును ఇయ్యమనెను. భార్యాభర్తలు ఇరువురును సొమ్మును పుచ్చుకొనలేదనిరి. కనకయ్య న్యాయాధిపతితో మనవి చేసికొనెను. 'రసీదు పుచ్చుకొంటివా?' అని న్యాయాధిపతి అడుగగా 'పుచ్చుకోనలే' దని కనకయ్య బదులు చెప్పెను. అప్పుడు న్యాయాధిపతి కనకయ్యను న్యాయస్థానమునకు పిలిపించి, కనకయ్య నిలువయుంచిన ధనమును ఇయ్యమని కోరగా 'నాకు కనకయ్య సొమ్ము ఇయ్యలేదు' అనెను. అప్పుడు న్యాయాధిపతి మల్లయ్యచేత ఒక యుత్తరమును అతని భార్యకు దిగువ విధమున వ్రాయించెను.

ప్రియమైన భార్యకు.

'కనకయ్య మనవద్ద దాచియుంచిన సంచిని నేను పంపిన మనుష్యునకు ఇయ్యగోరెద'. ప్రత్యుత్తరముగాని, ధనముగాని వచ్చువఱకు మల్లయ్య వెలుపలికి పోకుండ న్యాయాధిపతి నిర్బంధపఱిచెను. కొన్ని నిమిషములలో వెళ్ళిన మనుష్యుడు సంచితో దిరిగి వచ్చెను. అప్పుడు జిత్తులమారి మల్ల

య్య న్యాయాధిపతి కాళ్ళమీద బడి, క్షమించుమని వేడెను. కనకయ్య పాదములమీదబడి క్షమాపణను వేడుమని న్యాయాధిపతి తెలిపెను. అప్పుడు మల్లయ్య న్యాయాధిపతి కోరినట్లు చేయగా కనకయ్య అతనిని మన్నించి, తన సొమ్మును తాను తీసికొనెను. మల్లయ్య బుద్ధి తెచ్చుకొని, ఇక ఎప్పుడుగాని ఇట్టిపనిని చేయకుండునట్లు దృఢపఱచుకొని, ఇంటికి పోయి, సుఖముగ నిద్రపోయెను.



## 128. చెట్టుయొక్క సాక్ష్యము.

ఒక గ్రామస్థుడు పొరుగూరికి వెళ్లుచు తనవద్దనున్న నూఱురూపాయలను ఒక స్నేహితునికి ఒప్పగించెను. తిరిగి వచ్చిన తర్వాత తన రూపాయలను ఇయ్యమని కోరెను. రూపాయలను ఇయ్యలేదనియు తనకు ఏమియు తెలియదనియు స్నేహితుడు చెప్పెను. గ్రామస్థుడు న్యాయాధిపతి యొద్దకు వెళ్లి మొఱపెట్టుకొనెను. నీవు ఎచ్చట సొమ్ము ఇచ్చితివి అని న్యాయాధిపతి అడిగెను. సమీపమున నున్న మామిడిచెట్టుక్రిందను అని గ్రామస్థుడు బదులు పలికెను. తన ముద్రను చెట్టునకు చూపి, తాను చెట్టును పిలుచుచున్నానని న్యాయాధిపతి తెలుపుము అనెను. ఆమాటలకు గ్రామస్థుడు ఆశ్చర్యపడుచు, చెట్టును పిలువబోయెను.

ఇంతలో రెండవవానిని చూచి న్యాయాధిపతి 'గ్రామస్థుడు ఇప్పటికి ఆచెట్టుయొద్దకు వెళ్లియుండునా?' అని ప్రశ్నించెను. అందుకు అతడు 'చెట్టు దూరమున నున్నది ఇప్పటికి పోయియుండడు' అని మాఱుపలికెను. కొంతసేపటికి గ్రామస్థుడు తిరిగివచ్చి, చెట్టు మాటలాడలేదని విన్నవించెను. న్యాయాధిపతి వానిని చూచి 'నీవు పోగానే చెట్టు ఇచ్చటికి వచ్చి సాక్ష్యము ఇచ్చినది. నీపక్షము తీర్పు చెప్పుచున్నాను' అని రెండవవానిని నూఱురూపాయలను ఇమ్మని ఉత్తరువు చేసెను.

---

# 129. ఒక అసూయగల బ్రాహ్మణుడు.

ఒక బ్రాహ్మణుడు తాను భాగ్యవంతుడు కావలెనని ఆశతో ఒక చెఱువు ప్రక్కను కూర్చుండి తపస్సు చేయుచుండెను. అతని ప్రక్కయింటివాడు వీనిని చూచి ఆచెఱువు యొక్క రెండవవైపున కూర్చుండి తపస్సు చేయుచుండెను. కొన్నిదినములు గడచిన పిమ్మట దేవుడు ప్రత్యక్షమై మొదటవానిని ఏమికావలెను అని అడిగెను. అందుకు అతడు అవతల వైపున కూర్చుండు బ్రాహ్మణుడు మిమ్ములను ఏమికోరునో అంతకు రెండు అంతలు నాకు దయచేయు

మని ప్రార్థించెను అప్పుడు దేవుడు రెండవ వానికి ప్రత్యేకముగా ఏమికావలెనని అడిగెను. అందుకు వాడు మొదటి బ్రాహ్మణుడు కోరినది ఏమి అని ప్రశ్నించెను. వాడు కోరినది దేవుని వలన తెలిసికొని, తనకంటె ఎవడును అదృష్టవంతుడుగ నుండ కూడదని తలచి నాకు ఒక కన్ను గ్రుడ్డి అగునట్లు చేయుము. అని దేవుని కోరెను. దేవుడు నవ్వుచు అట్లనే కానిమ్మా అనెను. ఈకారణమున వీనికి ఒక నేత్రము గుడ్డిది అయ్యెను. మొదటి బ్రాహ్మణుని కిద్దు రెండును గుడ్డివి ఆయెను.

---

## 130. ఇద్దరు లోభులు.

మెరాఘా పట్టణములోని ఒక లోభి బసోరాలో ఒక లోభి ఉన్నాడని విని వానిని చూచుటకు వెళ్లి, వానికి శిష్యుడు అగుటకు ఒప్పుకొనెను. మరియు వాడు శిష్యుని వెంట బెట్టుకొని బసోరాలోభి బజారునకు వెళ్లి, రొట్టె అమ్మే వానిని మంచి రొట్టె ఉన్నదా అని అడిగెను. వెన్నవలె మెత్తగను తెల్లగను ఉన్న రొట్టెలు ఉన్నవి అని వాడు చెప్పెను. అప్పుడు బసోరాలోభి తన శిష్యునిచూచి, 'రొట్టె లవాడు చెప్పిన దానిని బట్టి చూడగా రొట్టెకంటె వెన్న మంచిదిగ తోచుచున్నది. కాబట్టి వెన్నను కొందము' అని

చెప్పి, వెన్నను అమ్మువాని ఇంటికి పోయి,మంచివెన్న ఉన్నదా అని ప్రశ్నించెను. అందుకు వాడు 'ఉన్నది, నూనెవలెశుద్ధ ముగనుండు వెన్న కలదు' అని బదులుచెప్పెను. వెన్న కంటె నూనె ఉత్తమమనివారు తలచి నూనెను అమ్మువాని ఇంటికి పోయిరి. మంచి నూనె అమ్మకమునకు ఉన్నాదా అని అడుగగా అతడు, 'ఉన్నది. నానూనె నీటివలె తేటగను, స్వచ్ఛముగను, ఉండును' అని ఉత్తరముచెప్పెను. అప్పుడు బసారాలోభి అట్లయినయెడల నాయింటిలో రెండు పీపాల నిండుగ మంచి నీళ్ళు కలవు! అని పలికి తనతోశిష్యునితో యింటికిపోయి, కావలసినంత నీటిని త్రాగుమని చెప్పెను. నేను వ్యర్థముగ బసారాకు రాలేదు. నేను యిచ్చటకువచ్చి చాల సంగతులను నేర్చుకొంటిని. అని మనస్సులో తలచి, బసారాలోభి సెలవు పుచ్చుకొని, మొక్కాకు వచ్చిచేరెను.

---

# 131. ఒక వర్తకుడు, అతని చెవిటి స్నేహితుడు.

ఒక పట్టణమునందు ఒక వర్తకుడు ఉండెను. అతడు చాల జబ్బుస్థితిలో ఉన్నట్లు విని అతనిని చూచినప్పుడు అతని చెవిటిస్నేహితుడు బయలు దేరెను. అడుగ వలసిన ప్రశ్న

లను ఆ స్నేహితుడు త్రోవలో ఇల్లు తీర్మానించుకొనెను. 'అయ్యా! మీశరీరమునందు ఇప్పుడు ఎట్లున్నది' అని మొదట అడిగెదను. కొంచెము సుమారుగ ఉన్నది అని అతడు జవాబు చెప్పును. అందుకు సంతోషము అని చెప్పి పథ్యముఏమి! అని రెండవ ప్రశ్న వేయుదును. పలాని పథ్యము అని చెప్పిన తర్వాత దానివలన మీకు నెమ్మది అగును. అని పలికి ఎవరు వైద్యుడు అని ప్రశ్నించెదను. వైద్యునిపేరు వారు తెలిపిన పిమ్మట వారు తప్పక మిమ్ములను బాగుచేయుదురు అనిచెప్పి అచ్చట నిలువకయే నాఇంటికి వచ్చి చేరుదును. వర్తకుని యింటిలోనికి వెళ్ళి తలచిన ప్రకారము 'మీశరీరమునందు ఎట్లున్నది' అని అడిగెను. అందుకు ఆవర్తకుడు చాల శ్రమపడుచున్నాను అని బదులు చెప్పెను. వర్తకుడు చెప్పినది చెవిటి వానికి వినబడక తాను తలచినట్లు కొంచెము సుమారుగ నున్నది అనిచెప్పి యుండునని తలచి సంతోషము అనెను. ఇది వినగా వర్తకునికి కోపము వచ్చెను. ఇంతలో పథ్యమూ ఏమి! అని రెండవప్రశ్నను వేసెను. అప్పుడు వర్తకుడు కోపముతో పథ్యము నేలమట్టి, పేలపిండి అనెను. ఈపథ్యము మీకు స్వస్థతను దెచ్చును అని చెవిటి స్నేహితుడు చెప్పి వైద్యుడు ఎవరు అని అడిగెను. రోగి చాల జబ్బుస్థితిలో నుండుట వలన యముడే వైద్యుడు అని ప్రక్కనున్న వారు జవాబు చెప్పిరి. ఆవై

మ్యుడు మిమ్ములను బాగుపరచును అనెను. అతని స్నేహితుడు ప్రక్కనున్న వారందరు వీనిని కొట్టి పంపుటకు ప్రయత్నించు చుండగా అతడు వర్తకుని యింటినుండి కాలికి బుద్ధిచెప్పెను.

---

## 132. ఒక సుల్తాను, అతని మంత్రి.

యవనదేశమునందు ఒక సుల్తాను రాజ్యము చేయు చుండెను. అతడు తనదేశములోని జనులను బాధ పెట్టుట వలన అనేకులు తమ గ్రామములను విడిచిపెట్టి పోవుచుండిరి, కనుక గ్రామములు పాడయిపోవుచుండెను. సుల్తానుకు మంచిబుద్ధి వచ్చుటకుగాను అతని మంత్రి సుల్తానుతో 'మహాప్రభూ' ఒక ఋషియొక్క దయవలన నేను పక్షిభాషను నేర్చుకొంటిని. ఏపక్షి ఏమి పలికినను గాని అర్థమును నేను చెప్పగలను' అనెను. ఒకనాడు సుల్తాను అతని మంత్రితో వేటకు వెళ్లినప్పుడు త్రోవలో రెండు పిట్టలు మాటలాడుచుండుట విని, అవి ఏమి మాటలాడుచున్నవో తెలుపుమని మంత్రిని కోరెను. ఆమాటలు తమరు వినుటకు తగినవి కావు అని మంత్రి బదులు చెప్పెను. అప్పుడు సుల్తాను 'ఏమాటలు అయినను సరే, నేను తప్పక వినవలెను.' అని కోరగా, అతని మంత్రి ఇట్లు పలికెను. 'ఈపక్షులలో ఒకదానికి ఒక మగపిల్లకలదు. రెండవదానికి ఆడుపిల్ల. మగపిల్లగల పక్షి రెండవదానిని

చూచి, ఈపిల్లను నామకపిల్లవానికి ఇచ్చినప్పుడు నీవు అయిదు పాడు గ్రామములను అరణముగా ఇచ్చుటకు ఒప్పుకొందువా? అని అడిగెను. అప్పుడు కొండవపతి 'దేవుని దయవలన మహామ్మదుసుల్తాను రాజ్యము చేయువఱకు పాడుగ్రామములకు తక్కువలేదు. అయిదు గ్రామములు కావు; నూఱుగ్రామములను ఇచ్చెదను.' అని బదులు చెప్పెను. ఈమాటలు విని మహామ్మదు సుల్తాను సిగ్గుపడి, పాడుపడిన గ్రామములను పునర్నిర్మాణము చేసి, తన జనులను ప్రేమతో చూచుటకు మొదలు పెట్టెను.



## 133. పిచ్చిపుల్లయ్య.

ఒకానొక గ్రామమునందు ఒక కమ్మచౌదరిగారియొద్ద ఒకడు నౌకరికి కుదిరెను. వానిపేరు పిచ్చిపుల్లయ్య, వానికి ఎంత తిండియైనను చాలదు. వాడు ఎప్పుడును ఏవో పిచ్చిపనులు చేయుచుండును. ఒకనాడు చౌదరిగారు కోడిపిల్లలను జాగ్రత్తగా చూచికొనుమని చెప్పిరి. వాడు ఆరాత్రి కోడిగంపను కోడిపిల్లలమీద బోర్లించి, జాగ్రత్తకొఱకు దానిపైని పండ్రెండు గుండ్రాళ్లు పెట్టెను. తెల్లవారునప్పటికి ఆపిల్లలన్నియు ఊపిరి ఆడక చచ్చెను.

చౌదరిగారి యింట్లో పనియెక్కువ; తిండి తక్కువ. ఈబ్రతుకు బ్రతుకుటకంటె చచ్చుట ఉత్తమమని పుల్లయ్య తలచుచుండెను. ఇట్లుండగా ఒకనాడు చౌదరిగారి భార్య గర్భిణిగ నుండుటవలన ఆపె పుట్టింటివారు సూడిద పంపిరి. పుల్లయ్య తినిపోవునను భయముతో వానినిపిలిచి చౌదరిగారి భార్య 'ఓరీ! ఇది విషమునుమా! తినిన యెడల చచ్చిపోదువు' అని చెప్పి, దానిని ఉట్టిమీద పెట్టెను. ఈమాటలు పుల్లయ్యకు జ్ఞప్తికివచ్చి, ఆమెకు తెలియక ఉట్టిమీద నున్న లడ్డుఉండలను అన్నిటిని తినివేసి, కాళ్ళు చాచుకొని, చావుకు ఎదురు చూచుచు పండుకొనియుండెను. ఇంతలో చౌదరిగారు ఇంటికి వచ్చి, పుల్లయ్యను చూచి, ఏరా, సాయంకాలము కాకమునుపే నిద్రపోవుదువా! అని నాలుగు తన్నులు తన్నెను. అప్పుడు పుల్లయ్య నన్ను ఇంక ఎంతకాలము తన్నెదరు? బుట్టెడు విషము మ్రింగితిని. అనెను. బుట్టెడు విషము ఏమిటి అని చౌదరిగారు భార్యను అడిగెను. ఆమె పరుగెత్తికొనివచ్చి ఉట్టిమీద చూడగా ఉత్తబుట్ట ఉండెను. వారి ప్రాణములకు పుల్లయ్య పిశాచమువలె దాపరించెనని తిట్టి, భార్యాభర్తలు వానిని ఒడలు విఱుగునట్లు కొట్టిరి.

మఱియొకసారి చౌదరిగారు గ్రామాంతరము వెళ్ళుచు పుల్లయ్యను బండివెంట రమ్మని, క్రింద సూదికూడ పడనీయక

చూడుమని చెప్పి, రాత్రివూట నిద్రపోయెను. వుల్లయ్య రాత్రియంతయు మేలుకొని, ఎడ్లకడులను అన్నిటిని ఎత్తి, నిద్రించువారి తలలక్రింద జాగ్రత్తగా పెట్టెను. తెల్లవారలేచి చూడగా గుడ్డలన్నియు పేడమయమై యుండెను.

ఇట్లు పిచ్చివుల్లయ్య చేయుపనులకు చౌదరిగారు చాల దుఃఖించి, వానిని తక్షణము ఇంటినుండి వెడలగొట్టిరి.



# 134. పరమానందయ్యగారి శిష్యులు.

విద్వాంసులగు పరమానందయ్యగారును వారి అయిదుగురు శిష్యులును ఒక రాజునొద్దకు వెళ్ళిరి. ఈశిష్యులలో ఒకడు వ్యాకరణము, ఒకడు తర్కశాస్త్రము, ఒకడు వైద్యశాస్త్రము, వేరొకడు సంగీతశాస్త్రము, తక్కినవాడు జ్యోతిషము చదివియుండిరి. వీరి రాకకు రాజుగారు సంతసించి భోజనమునకు రెండువరహాలను ఇచ్చిభోజనము అయినపిమ్మట సంభావనకు రమ్మని చెప్పిరి. శిష్యులందరును వంటకు ప్రారంభించిరి. వైద్యశాస్త్రము చదివినవాడు కూరలు తెచ్చుటకు వెళ్ళి బెండకాయ శ్లేష్మము, చేమగడ్డ మందము, చిక్కుడుకాయ పైత్యము, అనుచు ఒక్కొక్క కూరకు ఒక్కొక్కలోపము చూపి దేనినికొనక తిరిగి వచ్చెను. జ్యోతిష్కుడు విస్తరాకులకు పోయి

విస్తరాకులు కోసికొని చెట్టు దిగుచుండగ ఎవ్వరో తుమ్మినటువలన విస్తరాకులను పారవేసి రెండు గంటలసేపు చెట్టుమీదనే యుండి ఈ అపశకునము వలన ఎవరికి ఏమి అపాయము సంభవించినదో అని భయపడుచు ఇంటికి చేరెను. నేతికి పోయిన తార్కికుడు నేతిని దొన్నెలో పోయించుకొని వచ్చుచు నేతికి దొన్నె ఆధారమా, దొన్నె నేతికి ఆధారమా అను సందేహమును తీర్చుకొనుటకు దొన్నెను తలక్రిందుగా త్రిప్పగా నేయి అంతయు ఒలికిపోయెను. వైయాకరణి పెరుగుకొని తెచ్చుచు పెరుగుమనిషి పెరుగో అని మూడు మాత్రలకంటె ఎక్కువ దీర్ఘము తీయుట శాస్త్రవిరుద్ధము కాబట్టి ఆ పెరుగు త్రాగుటకు పనికిరాదని నిశ్చయించుకొని దానిని పారపోసి ఇంటికి వచ్చెను. వంట చేయుచుండిన సంగీతశాస్త్రజ్ఞుడు అన్నము కళపెళ ఉడుకుచుండగా తాళము వేసిచూచి క్రమమైన తాళము కుదురక ఛీ! ఈ తాళము పడని పాడుపాట యెందుకు అని గరిటెతో కుండను కొట్టగా కుండపగిలి ఎసరు కారిపోయెను. శిష్యులందరు ఇంటికి వచ్చి చూడగా స్నానమునకు పోయిన గురువు రాకుండుటచూచి వారికి ఎదురు బోయిరి. త్రోవలో ముల్లు గుచ్చుకొని గురువు బాధపడు చుండెను. ముల్లుతీయుటకు శిష్యులు ఒక సూదిని సంపాదించిరి. కాని ఎవరు దానిని గురువు నొద్దకు తీసికొనిపోవలసినదియు తీర్మానముకాక ఒక తాటిదూలమునకు దానిని గుచ్చి అందరును మోసికొని

పోవుచుండిరి. ఇంతలో ఒక వేశ్య ఎదురుపడి వారికి నమస్కారము చేసెను. ఎవరికి నమస్కారము చేసినది తెలియక బోగము దానిని అడుగగా ఆస్త్రీ దారిలో శుద్ధ వెర్రివాడు ఎవడో వానికి నమస్కారము చేసితినని చెప్పెను. ఆవెర్రివాడు నేను నేనని వారుజగడము చేయుచుండగా రాజభటులు వారిని పట్టుకొని పోయిరి. రాజుగారు వారి వలన జరిగిన సంగతులను గ్రహించి ఎంతచదివినను ఛాందసము పోనందులకు మిగులవగచెను.



## 135. ఏకాదశితాంబూలము.

ఒకనాడు ఒకఅగ్రహారములో ఒక బ్రాహ్మడు వీధివాకిట గూర్చుండి, తాంబూలము వేసికొనుచుండెను. దారిని పోవుచుండిన యొక బ్రాహ్మణుడతనినిజూచి, ఏమయ్యా, ఏకాదశి యని తెలియక తాంబూలము వేసికొనుచున్నావా, అనియడిగెను. అందుకు అతడు 'ఉల్లిగడ్డలకంపుపోవద్దా' అని అడిగెను. అయ్యా,ఉల్లిగడ్డలనుగూడ సేవించితివా,అని రెండవవాడుప్రశ్నించెను. అప్పుడు మొదటి బ్రాహ్మణుడు, పుల్లని చద్దియన్నములోనికి ఉల్లిగడ్డలు లేకున్నపక్షమున తినుటకష్టముగనుండునే, అనెను. 'బాగు, బాగు, ఏకాదశిరోజున చద్దియన్నముతోను ఉల్లిగడ్డలు!' అనిమందలించెను. అందుకుప్రథమ బ్రాహ్మణు

డు, నేను చద్దియన్నము తినకపోయినపక్షమున నాకున్న మేహాకారకము తగ్గదు, అనిమాటలుపలికెను. ద్వితీయబ్రాహ్మణుడు మొదటివానిని జూచి, నీవు బ్రాహ్మణోత్తముడవు. నిన్నుజూచిన బ్రాహ్మణుల కందఱకును పుణ్యముకలుగును. అని చెప్పుచు తన దారిని పోయెను.



## 136. పిల్లవానిని గ్రద్ద తన్నుకొని పోవుట.

ఒక కోమటి కాశీయాత్ర చేయబోవుచు నూఱు బారువులలోహమును ఒక స్నేహితుని చేతికిచ్చి పోయెను. యాత్రముగిసినపిదప లోహమును అడుగగా అతని సఖుడు ఇట్లు పలికెను. 'నీలోహమును ఒక గదిలో నుంచి తలుపువేసితిని. కొన్నిదినములయిన పిమ్మట తలుపు తెరచిచూడగాలోహము కొంచెమయినను గనబడలేదు. లోహమునంతను ఎలుకలు తినియుండును. నేనేమిచేయగలను?' లోహము నిచ్చినప్పుడు సాక్షులులేరు కనుక కోమటి తనకోపమును లోలోపలఅణచుకొని తనమిత్రునితో స్నేహముగ నున్నట్లు నటించుచుండెను.

ఒకనాడు తనస్నేహితుడుస్నానమునకు బోవుచు తన పిల్లవానిని వర్తకుని దగ్గఱ కూర్చుండ బెట్టి వెళ్లెను. స్నానానంతరము నాకొడుకు ఎక్కడ అని అడిగెను. అందుకు వర్తకుడు

బిక్కు మొగము పెట్టుకొని ఒకనాడు పాడు(గద్ద వానిని నెత్తుకొనిపోయినది అని జవాబు చెప్పెను. తండ్రి వర్తకుని నమ్మక ఫిర్యాదు చేసెను. వర్తకునినడుగగా నూఱు బారువుల లోహమును ఎలుకలు తినగా పిల్లవానిని గ్రద్ద తన్నుకొని పోవుట అద్భుతమా? అని చెప్పెను. న్యాయాధిపతి లోహమును వర్తకునికిని, పిల్లను తండ్రికిని ఒప్పగించెను.



## 137. ముక్కు కన్నుల వివాదము.

సులోచనములు ఎవరివి అని ముక్కునకును కన్నులకును వివాదము జరిగెను. చెవులు తీర్పుచెప్పుటకును, నాలుక న్యాయవాదిగను ఏర్పాటు ఆయెను. మొదట ముక్కుపక్షమున నాలుక ఇట్లు వాదించెను:—

'సృష్టి మొదలుకొని సులోచనములు ముక్కుమీఁద నిలచియుండుటవలన దానికే విశేషభుక్తము అని అందఱును ఎఱుఁగుదురు. ముక్కును అనుసరించి సులోచనములు కట్టింపబడుచుండెను. మఱియు ఇంకొక విషయము. ముక్కులేనివాఁడు సులోచనములను వాడఁడు. కాబట్టి సులోచనములు ముక్కునకు సంబంధించినవి. 'ఇందుకు సందేహము లేదు.'

చమత్కారముగ మాటలాడనేర్చిన నాలుక కొంతసేపు ఊరకుండి, కన్నుల తరపున వాదించుటకు ప్రారంభించెను.

అది ఇట్లు చెప్పెను. సులోచనములు అను మాటవలన అవి కన్నులవి అని తెలియుచున్నది. అవి ముక్కువి అయినచో సునాసికములు అనబడును. సృష్టిమొదలుకొని సులోచనముల లాభములను కన్నులు అనుభవించుచున్నవి. మఱియు, గ్రుడ్డివాడు సులోచనములను ధరించునా? సులోచనములను పెట్టుకొని కన్నులు మూసికొన్నచో చూచుటకు వీలగునా? ఈకారణములవలన లోచనములకొఱకు సులోచనములు ఏర్పడినవి అని సిద్ధాంతము చేయగలము.

చెవులు రెండుపక్షముల వాదములను విని, 'వెలుగు సమయములందు సులోచనములను ముక్కు ధరించునపుడు కన్నులు తమ ఱెప్పలను మూసికొనవలెను' అని తీర్పు చెప్పెను.

---

# 138. గురువుభార్య, శిష్యునిభార్య.

గుంటూరులో కొన్నిసంవత్సరముల క్రిందట ఒకశాస్త్రి యుండెను. అతనిభార్య గయ్యాళిఆమెమగనిని ఎప్పుడును తిట్టుచుండును. మగడుతలవంచుకొనియుండుటచూచి శాస్త్రిగారి శిష్యుడు నవ్వుచుండెడివాడు. నీకు ఒక గయ్యాళి దొరకినపుడు నీనవ్వులు అడగనులే, అని శాస్త్రిచెప్పుచుండెను.

విద్యముగిసినతర్వాతశిష్యుడు తనగ్రామమునకువెళ్లెను. శిష్యునియొక్క ప్రఖ్యాతివిని గురువు అతనిని జూడవచ్చెను. అప్పుడుశిష్యుడు తనభార్యను ఏకాంతమునకు బిలిచి తాను గురువుందురోజున నెన్ని తిట్లిసను. పడియుందుమని బ్రతిమాలెను. అందుకుఆమెసమ్మతింపక, నాఁకుతిట్లకంటె నెక్కువ తిట్లు అతనినోటనుండి వెడలిన యెడల వస్త్రిమొదలుతో ఒప్పచెప్పెదను. అనిపలికెను. శిష్యుడుతనభార్యను దిట్టుటకారంభించి, అధికారముచెల్లించుచుండెను. రాత్రిభోజనముపుడు పులుసు వడ్డించుసమయమునకు నాఁకుతిట్లు బూర్తియయ్యెను. పులుసుకొంచెము గురువుగారిమీద చిందుటచే శిష్యుడు రండా! అనితిట్టుటకుప్రారంభించెను. ఈమాట మగని నోటినుండి రాగానే వేడిపులుసుకుండను మగని నెత్తిపైన పెడేలమని వేసెను. అంతేకాక; పులుసు కుండ యొక్క వెలను దిగువున పెట్టుమని కోరెను. అప్పుడు గురువు శిష్యుని భార్యను దీవించి, 'అనేకశతభాండాని భిన్నాని మమ మస్తకే అహో గుణవతీ భార్య భాండమూలమ్ నయాచతే' నాశిరస్సుమీద అనేకములగు కుండలు పగిలినవిగాని, ఎంత గుణవంతురాలు నాభార్య. నన్ను కుండ వెలను తెమ్మని అడుగదు. అనుకొనుచు గుంటూరునకు మరలి వెళ్లెను.



# 139. ఒక గూనివాని కథ.

ఒకానొక బ్రాహ్మణునియింటికి ఒక రాత్రి ఒకగూని వాడు భోజనమునకువచ్చెను. వాడు తొందరతో భుజించున పుడు మామిడిటెంక గొంతునకు అడ్డుపడి క్రింద పడిపోయెను. అప్పుడు బ్రాహ్మణుడు చాలా భయపడి యాగూనివాని నొక వైద్యునియింటివాకిట కూర్చుండబెట్టి లోపలికి వెళ్లి, వైద్యునికి పదిరూపాయలనిచ్చి, వాకిలోనున్న రోగికి మందు నిమ్మని కోరి తాను చెఱువు సమీపమునకు వెళ్లి వచ్చెదనని చెప్పిపోయెను. వైద్యుడు రోగిని చూచుటకు దీపము తెచ్చుతొందరలోవా నిని తన్నెను. అప్పుడు నేల పడెను. నాడి పరీక్షించగా అంద లేదు. తన తన్నువలన రోగి చనిపోయి యుండవచ్చునని తలచి తన యింట శవము కనబడినచో తాను నేరస్థుడు కావచ్చునని భయపడి, గూనివానిని మోసికొనిపోయి, సమీపముననున్న జేమచెట్టు మొద్దునకుఆనించి, వాని బాహువులను ప్రక్కనున్న రెండుకొమ్మలమీదనుంచి, ఇంటికిపోయెను, కొంతసేపటికితో టకాపరివచ్చి, గూనివానిని జేమచెట్టు ఎక్కుటకు సిద్ధముగ నున్నదొంగగాభావించి, దొంగ, దొంగ, అనిఅఱచి, దుడ్డుకర్ర తో వానిసిమోదెను. ఏమూలుగుగాని లేకపడియుండుటచూ చి తనదెబ్బవలనగూనివాడు మృతినొందెనని యోచించి, వా నినిదీసికొనిపోయి, ఒకవీధిమూలతిరుగుడులో నిలువబెట్టెను.

ఆరాత్రి చీకటిలో మూలను పోవుచుండిన యొక సావుకారు కాలుతగిలి ఆగూనివాడు వానిమూట మీదబడెను. గూనివా నిని దొంగ అనకొని షావుకారు వానిని ఇనుపగజముతో బాదుచు, దొంగ, దొంగ అనిఅఱచెను. ఇరుగుపొరుగువారు క్రిందబడినగూనివానిని పట్టుకొని, న్యాయాధిపతి యొద్దకు లాగుకొనిపోయిరి. మఱునాడు న్యాయాధిపతినేరమును విచారించి షావుకారునికి ఉరిశిక్ష విధించెను. వానిని ఉరితీయుసమయమునందు తోటకాపరి వచ్చి జరిగినసంగతివిన్నవించి, తన్ను ఉరితీయుమని కోరెను. ఇంతలో వైద్యుడును, బ్రాహ్మణుడును వచ్చి తాము దోషులమనిచెప్పిరి. బ్రాహ్మణునకు ఉరిశిక్షవిధించుటకు మనసుఒప్పక, తలారులనుపిలిచి, గూనివానినోటిలో నీరుపోయుమనెను. ఆనీటివలన మామిడి టెంక కడుపులోనికి పోయి గూనివాడుబ్రదికెను. అందఱును సంతోషించిరి.



## 140. రాజు, మిడుతలు

అనగాననగా ఒకదేశములో ఒకరాజు ఉండెను. అతనికి కథలు వినుటయందు ప్రీతి ఎక్కువ. వినినకొలఁది, ఇంకను వినవలెనని కుతూహలపడుచుండెను. ముగింపులేని కథను ఎవరుగాని చెప్పినయెడల వానికి తన కూతునిచ్చి వివాహము చేసి, తనరాజ్యమును ఒప్పగించుదు నని చాటించెను. అట్టి కథను చెప్పలేని కథకులయొక్క తలలు నఱుకబడునని కూడ

తెలియబఱచెను. రాజుగారి కొమార్తె చాలచక్కనిది కనుక కథచెప్పి, పెండ్లియాడుటకు వేనవేలు జనులు వచ్చిరి గాని, ఎవరును అంతములేని కథను చెప్పలేకుండిరి. కొందఱి కథలు వారములో ముగిసెను; కొందఱివి నెలలో తుదముట్టెను; ఒకరికథమాత్రము సంవత్సరము పట్టెను. పాపము ఈకథకులందఱును శిరశ్ఛేదము ననుభవించిరి. తుదకొకనాడు ముప్పదిసంవత్సరములయువకుడు ఒకడు రాజును సమీపించి, కథ చెప్పుటకు మునుపు కొన్నివిషయములను అడుగవలసియున్నది అనెను. రాజు వానిని తెలియజేయుమనెను. అప్పుడు ఆయువకుడు ఇట్లు పలికెను. 'భోజనమునకును, నిద్రకును కావలసిన కాలమునందు తప్ప మిగతకాలమునందు కథను చెప్పుదును. కథ చెప్పునప్పుడు మీరు నాయెదుట కూర్చుండవలెను. నేను కథ చెప్పుచుండునపుడు, తర్వాత ఏమిజరిగినది అని గాని, సంగ్రహముగ చెప్పుము అని గాని, లేక మఱియే మాటలను గాని మీరు ఆడగూడదు. ఈషరతులకు మీరు ఒప్పుకొనినయెడల నేను నాకథను ప్రారంభించెదను. రాజు వానికి సమ్మతించెను, ఆ పడుచువాడు కథను ఇట్లు ప్రారంభించెను. 'పేరాస దేశమును రెండువందల సంవత్సరములకు పూర్వము ఒక రాజు పాలించుచుండెను. అతడు అత్యాశ కలవాడు. అతడు తన దేశములోని జనుల ధాన్యమును అంతను వశపరచుకొని ఒక విశాలమగు ఇంటిలోపోసి తా

శము వేయించెను. ఆ ఇంటిని కట్టిన తాపీవాండ్రు పొరపాటున మీది భాగమునందు ఒక రంధ్రము నుంచిరి. ఈరంధ్రము చుట్టు ఒక మిడుతలగుంపు వ్రాలెను. రంధ్రము చిన్నది గనుక ఒక్కొక్క మిడుత మాత్రము ఇంటిలోనికి పోగలిగెను. మొదట ఒక మిడుత లోపలికివెళ్ళి ఒక గింజను తెచ్చుకొనెను. తర్వాత ఇంకొక మిడుత లోపలికి పోయి ఇంకొక గింజను తెచ్చుకొనెను. తర్వాత ఇంకొక మిడుత లోపలికివెళ్ళి ఒక గింజను తెచ్చుకొనెను. ఇట్లు కథ చెప్పుటతో ఒక సంవత్సరము ముగిసెను. ఇప్పటికి విసుగుపుట్టి కథకుని 'ఈప్రకారము మిడుతలన్నియు ధాన్యమును తీసికొని పోయియుండును. తర్వాత ఏమి జరిగిదో దయచేసి చెప్పుడు' అని రాజు బ్రతిమాలెను. అందుకు యువకుడు ,మీరిట్టి ప్రశ్నల నడిగి నాకు మనోవ్యథ కలిగింప కూడదు అనెను. తరువాత కథ ప్రారంభింప బడెను. తర్వాత ఒక మిడుత లోపలికిపోయి ఇంకొక గింజను తెచ్చుకొనెను. తర్వాత ఒక మిడుత లోపలికిపోయి ఇంకొక గింజను తెచ్చుకొనెను. ఈప్రకారము మరియొక సంవత్సరము గడిచెను. అప్పుడు రాజు యువకునిచూచి 'స్నేహితుడా ఈమిడుతల బాధ ఎప్పటికి వదలును' అని ప్రశ్నించెను. 'ఆ యింటిలో ఇప్పటికి ఒక అంగుళము మేర ఖాళీ అయినది' అని పడుచువాడు జవాబుచెప్పి తిరిగి కథను ప్రారంభించెను. ,తర్వాత ఒక మిడుత లోపలికిపోయి ఇంకొక గింజను తెచ్చుకొనెను......

ఈప్రకారము మరియొక సంవత్సరము ముగియు నప్పటికి రాజునకు పట్టరాని కోపము కలిగి తన కూతుని రప్పించి 'ఇదిగో నాకొమార్తె ఈమెను నేను నీకిచ్చుచున్నాను. వివాహమాడుము. నారాజ్యము నీకు ఇచ్చివేసితిని. ఇంతటితో నీకథ చాలించుము' అని పలికి తపస్సుచేయుటకు అడవికి వెడలెను. ఆ యువకుడు ఆ రాచకొమార్తెను పెండ్లియాడి పేరాస దేశమును పాలించుచు చాల కాలము గడపెను.

సమాప్తము



రాజన్ ప్రెస్, రాజమండ్రి.

# శ్రీకృష్ణవాచకములు.

త్వరలో వెలువడును.

వీనిని రచించినవారు మదరాసు ఎడ్యుకేషనల్ సర్వీసులో చేరియుండి, కుమారవాచకాది గ్రంథములను వ్రాసియున్నవారు.

---

# మైసూరు సుగంధద్రవ్యములు వగైరా

మేలైన మైసూరు సుగంధ ద్రవ్యములను, వెండి జేకు పటములను, సరసముగ కోరువారు డిగువ విలాసమునకు వ్రాయ ప్రార్థితులు.

మహాకాళి సుబ్రహ్మణ్యము,
బి. ఎ., యల్. టి,
ఇన్నీసుపేట, రాజమహేంద్రవరము.

